# సిందుబాద్-
# సాహస వీరగాధలు



★



రచన

శ్రీ సత్యవోలు రాజశేఖరరావు



★

కాళహస్తి తమ్మారావు అండ్ సన్స్,
గ్రంధప్రకాశకులు : : రాజమహేంద్రవరం.

# సిందుబాద్ - సాహసవీరగాథలు

పూర్వము బాగ్దాదునగరములో,
హిందుబాదను కూలివాడు
కలడు. ఆతడు కడుబీదవాడు. బరువు మూటలు మోసి, కూలి సంపాదించి జీవించేవాడు. ఆతడొక మండువేసవికాలపు రోజున, మిట్టమధ్యాహ్నము బరువుమూటలు నెత్తినపెట్టుకొని పోవుచుండెను. ఎండనిప్పుల గ్రక్కుచుండెను. అతనికా మండుటెండలో కాళ్లుకాలి పొక్కులెక్కెను. వేడిగాలుపు తగిలి ఆతనిముఖము, వళ్లు, యెర్రగా కమిలిపోయెను. ఆ కూలివాడు మిక్కిలి అలిసిపోవుటచేతను, యింకను చాల దూరము పోవలసి యుండుటచేతను, విశ్రాంతికై నీడగావున్న ఒకపెద్ద యింటిముందు ఆగి, నెత్తిమీది బరువునుదింపెను. ఆ యింటిలోనుండి అత్తరువు పన్నీరు అగరువత్తుల పరిమళము "ఘుమ్మను"చు వచ్చి వీధిఅంతయు నిండిపోయెను. మంచి హాయిగానుండు సంగీతము, చక్కగా వినబడుచుండెను. మంచి రుచిగల రకరకములైన పిండివంటల సువాసనలు వేయుచుండెను. కూలివాడు సంతోషముతో, అక్కడే చాల వరకు నిలచిపోయెను. ఆ యింటిలో గొప్పవేడుకలు, పెద్దవిందు

భోజనములు, జరుగుచున్నవని తలచెను. ఆతనికా మేడ యెవ్వరిదో తెలియదు. బీదవాడగు హిందుబాదు అచ్చట నున్న నౌకరులను, "ఈ మేడయెవ్వరిది? దీని యజమాని యెవ్వరు?" అని యడిగెను. ఆ సేవకులలో నొకడు "అన్నా! నీదీయూరుకాదా? నీకీమేడయెవ్వరిదో, యింత వరకును తెలియనే తెలియదా? ఈ గొప్పభవనము, మహా ధనికుడగు సిందుబాదు అనుఐశ్వర్యవంతునిది. ఆతడు పేరు ప్రఖ్యాతులు గడించిన గొప్పవర్తకుడు. ఆతడు ప్రపంచము నంతయు ప్రయాణము చేసివచ్చెను." అని యాకూలివానితో చెప్పెను.

కూలివాడీ మాటలువిని, సిందుబాదు ఐశ్వర్యమునకు, చాల అసూయపడెను. వారిద్దరికిగల భాగ్యము – బీదతనమునకు గల తేడానుగూర్చి తలచి మిక్కిలి విచారించెను. సిందుబాదు పొందుచున్న సౌఖ్యములు – కూలివాడుగా ఆతడనుభవించు చున్న కష్టములు, తలచుకొని చాల చింతించెను. ఆతడు కంఠమెత్తి గట్టిగా, "ఓ దేముడా నాకును ఆ సిందుబాదునకు, యింత తారతమ్యము యేల కలిగించితివి? ఆతనికంత ధన మెట్లుకలిగెను? నేనింత బీదవాడనై యిన్నికష్టములు పొందు చున్నానేమి? నాకు జాలిలేదా? ఆహా! ఏమి చిత్రము? ఆతడట్టి ధనముపొంది, సౌఖ్యము లనుభవించుటకై యేమి పుణ్యము చేసెను? నేనిట్టికష్టములు పొందుటకై, యేమిపాపము చేసి తిని?" అని తీవ్రవిచారముతో పిచ్చికేకలువేయుచు, నేలపై

కాళ్ళతో గట్టిగాబాది కొట్టెను. కూలివాడట్లు దుఃఖముతో, యిష్టమువచ్చినట్లు కేకలువేయుచుండెను. అంతలో సేవకు డొక డామేడలోనుండి వచ్చి కూలివాని చేయిపట్టుకొని, "ఓయి! నిన్ను మా యజమాని లోనికి పిల్చుకొనిరమ్మనెను. లోనికిరమ్ము" అనిచెప్పి తీసుకొనిపోయెను. కూలివాడు మిక్కిలి కంగారుపడి, శిక్షింతురేమోయని భయపడసాగెను. ఆ నౌకరు, కూలివాడగు హిందుబాదునొక పెద్దహాలులోనికి తీసుకొనిపోయెను.

ఆ హాలులో అందముగా చాలకుర్చీలు – బల్లలు – సోఫాలు అమర్చియుండెను. బల్లలపై మంచిఅందమైన పళ్ళెములు – ప్లేట్లు – గిన్నెలు పెట్టియుంచిరి. మంచి రకరకములైన రుచి – పరిమళముగల పిండివంటలు, వడ్డించియుండిరి. చాల మంది జనులు విలువగల బట్టలుకట్టుకొని, కుర్చీలలో కూర్చుండియుండిరి. ఒకచోట కుర్చీలో మంచి సొగసైన రూపము తెల్లగ నెరసినగడ్డము గల పొడుగైన యొకపూజ్యుడైన పెద్దమనిషి కనబడెను. ఆతడే మహాదైశ్వర్యవంతుడైన సిందుబాదు ఆ మేడకు యజమాని. ఆతనిప్రక్కనే చాలమంది సేవకులు చేతులుకట్టుకొని నిలచియుండిరి. కూలివాడు భయముచే వణుకుచు అచ్చటనున్న వారందరికి వంగి నమస్కారములు చేసెను.

సిందుబాదు సేవకునిజూచి బీదవానిని ఆతనియొద్దకు తీసుకొనిరమ్మని యాజ్ఞాపించెను. బీదవాడగు హిందుబాదును

సేవకుడు తీసుకొనివెళ్ళి సిందుబాదుదగ్గర నిలబెట్టెను. సిందు బాదు ఆ కూలివానిని ప్రేమతో దగ్గరకు తీసుకొని ఆతని కుడివైపున కుర్చీలో కూర్చుండబెట్టి ఆతడే స్వయముగా సమస్తపిండివంటలు పెట్టెను. సిందుబాదు ప్రేమతో కూలి వాని భుజముపై తట్టినిమిరి, "అన్నా! భయములేదు; తృప్తిగా భోజనము చేయుము." అని చెప్పెను. కూలివాడు కొంచెము కంగారుతో తినెను. విందు భోజనములైన పిదప చిరునవ్వుతో సిందుబాదు బీదవానితో, "అన్నా! నీపేరేమి? నీవేపని చేయుచుందువు?" అని అడిగెను. కూలివాడు "నాపేరు హిందుబాదు. నేను కూలిపనిచేయుచుందును." అని చెప్పెను. సిందుబాదు నాకు నిన్నుచూచుటచే చాల ఆనందమయినది. నీవు వీధిలో ఒకగంటముందు యేదో అను చున్నావు. ఆ మాటలే నాయెదుటకూడ చెప్పవా? నాకు వాటిని నీ నోటితో అనుచుండగా వినవలెనని కోరికగా వున్నది." అని ఆతనిని అడిగెను.

ఆ మాటలు విని బీదవాడు మిగులభయముచే వణు కుచు "ప్రభూ! నా కష్టములవలన యేదో తెలియక అట్లు పిచ్చికేకలుపెట్టితిని. మీమనస్సునకు చాలకష్టము కలిగించి యుందును. తప్పని తెలుసుకొంటిని. నన్ను క్షమింపవలెను. నేను చాల తెలివిహీనుడను. అనరానిమాటలు నా నోటివెంట వచ్చినవి. నన్నుకృపతో క్షమించుడు." అని బ్రతిమాలెను, సిందుబాదు "అన్నా! నీవేమియు తప్పుచేయలేదు. నీవనిన

మాటలు నిజమైనవే నేనీధనము - ఐశ్వర్యము - సుఖము కూడ యేమికష్టములేక సంపాదించితినని తలచితివి కాబోలు. నేనిప్పుడు అనుభవించు సుఖములు, భోగములు, ఐశ్వర్యము కూడ చాల సంవత్సరములు నానాబాధలు కష్టములుపొంది అనుభవించిన పిమ్మటేకలిగినవి. నాకనేక ఆపదలు సంభవించినవి. అవి సాధారణకష్టములు - అపాయములుకావు ! నాచిత్రగాధను నీవు వినియుండవు. నా సముద్రప్రయాణములలో, కలిగిన అపాయములు వినినచో, యెంతటి ధైర్యవంతునకైనను, అపరిమితమైన భయము కలుగకమానదు. అట్టి అద్భుతమైన ఆపదలుతో కూడిన నాజీవితచరిత్ర చెప్పెదను వినుము. అన్నికష్టములు పొందినతరువాత, బ్రతికిన నాకీ సుఖములు కలిగినవి. నా చరిత్ర వినుమని యిట్లుచెప్పసాగెను.

## 1 వ ఓడప్రయాణము

"అన్నా ! నాకు అపరిమితమైన ధనము, గొప్పభూవసతి నాకిచ్చి, నాతండ్రి చచ్చిపోయెను. నా యౌవ్వనములో ఆటపాటలకు చెడ్డనడతలకు అలవాటుపడి నాధనమంతయు వ్యర్ధముగా పాడుచేసితిని. పిమ్మట నా తప్పును గ్రహింపగలిగితిని. సరియైనమార్గములో నడచుకొనని నావంటి వారిఐశ్వర్యము క్షణములో నాశనమైపోవును. నా అవివేకమువల్ల ప్రపంచములో

విలువగలధనము కాలము కూడ పోయినందుకు చాలవిచారించితిని. హీనమైన దరిద్రదశకంటె చావు మేలుకదా? ఈ విధమైన అభిప్రాయములు నాలోకలిగినవి. చేతులు కాలిన తరువాత ఆకులుపట్టుకొనినట్లు అంతధనము పోయినపిమ్మట మిగిలిన నావస్తుసామగ్రిని పోగుచేసి, పిత్రార్జితమును కూడ కలిపి వేలమువేసి, కొంతడబ్బు సంపాదించితిని. పిమ్మట కొందరివర్తకులతో సలహాలుచేసితిని. వారిప్రోత్సాహముతో కొందరువర్తకులతో ఒడంబడిక కుదుర్చుకొని వర్తకము చేయుటకు అంగీకరించితిని.

వర్తకముతో నాకున్న ధనమును వృద్ధిచేయుతలంపు కలిగినది. నేను బాల్సారా వెళ్ళి అచ్చట ఓడపైని సరుకులు వేసి కొంతమంది వర్తకులతోకలసి జాయింటుగా సముద్రప్రయాణము చేయసాగితిమి. ఓడతెరచాపను యెత్తి సముద్రములో మాఓడ సరుకులతో ప్రయాణము చేయుచున్నది. తూర్పుసముద్రము, అబిస్సీనియా దాటి ఒకోవాదీవులను చేరితిమి. నాకిదే మొదటి సముద్రప్రయాణము అందుచే క్రొత్తదగుటచే శరీరారోగ్యము చెడిపోయి జబ్బుచేసినది. కాని మరల వెంటనే ఆరోగ్యవంతుడనై తేరుకొంటిని. పిమ్మట యిక నేనెట్టి జబ్బుతోను బాధపడలేదు. మా ప్రయాణములో చాలదీవులు తగిలినవి. వాటిలో కొన్నిచోట్ల మా సరుకును అమ్మితిమి. కొన్నిచోట్ల మా సరుకును యిచ్చి కొత్తసరుకు మార్చుకొంటిమి.

ఒకనాడు మా ఓడ ప్రయాణము చేయుచుండగా ఒకచోట సముద్రతీరమునకు సమీపముగా నీటిమట్టమునకు సమముగా ఒక చక్కని పచ్చని మైదానమువలెనున్న ప్రదేశము కనబడెను. అచ్చట మా ఓడ యజమాని తెరచాపలు కట్టివేసి లంగరువేసి ఓడను ఆపెను. "మైదానమును చూడ దలచినవారు వెళ్ళి చూడవచ్చు" నని మాతో చెప్పెను. ఉత్సాహవంతులమగు మేము కొంతమంది ఓడదిగి మైదానములోనికి పోయితిమి. అచ్చట కొంతవరకు ఆగి, వంట భోజనములు ముగించుకొని ఖులాసాగా కబుర్లు చెప్పుకొనుచు విశ్రాంతిగా కూర్చుంటిమి. ఇంతలో హఠాత్తుగా ఆ దీవి కంపించడం అరంభించెను. మేమందరమును భయముచే వణకి దొడిగితిమి. మిగులవేగముగా కదిలి మునిగిపోవుచున్న మైదానమును ఓడలోనివారు చూచి కంగారుపడి మమ్ములను త్వరగా ఓడ చేరమని గట్టిగా కేకలుపెట్టిరి. మీరు రాకపోయినచో మీరు చచ్చుట నిజమని అరచిరి. మేమందరమును పచ్చనిమైదానమని భ్రాంతితో పొరబడితిమి.

కాని అది నిజముగా ఒకతిమింగలముయొక్క శరీరమే! మాలో చాలమంది ప్రాణములు దక్కించుకొనుటకై అతివేగముగా పరుగెత్తి ఓడలో పడిరి. కొందరు నీటిలో యీదుచుపోయి ఓడనుచేరుకొని మెట్లో ఓడనెక్కిరి. నేను సర్వప్రయత్నములూచేసి, ఓడ చివరిభాగమును చేరేసరికి తిమింగలము సముద్రములో మునిగిపోయింది. నేను ఓడచేరునప్పటికీ ఓడ యజమాని లంగరుతీసి తెరచాపలుయెత్తి తిమింగలమునకు

భయపడి ప్రాణరక్షణకై ప్రయాణము సాగించెను. నేను మాత్రము ఓడ నెక్కలేకపోయితిని. నేను సముద్రములో ఒక కొయ్యముక్కను పట్టుకొని, సముద్రకెరటముల దయకు విడువబడితిని. నాజీవితరక్షణకై పోట్లాడుచు అట్లొకరాత్రియు పగలును మహాసముద్రములో యీదులాడుచుంటిని. చెవులు చిల్లులుపడునట్లు వీచేచలిగాలి, శరీరము కొరుకునట్లున్న చలిని లెక్కచేయక, అట్లే నీటిలో కొట్టుకొనుచుంటిని దాహము యెక్కువగానున్నది. ఆహారము లేదు. శరీరములో కొంచమైనను శక్తిలేదు. "ఆహా పరమేశ్వరా! ఎంత ఆపదకలుగజేసితివి?" అని జీవితముపై నిరాశకలిగి నీటిపై తేలుచుంటిని. ఇంతలో దైవవశముచే ఒకగొప్పకెరటములేచి నన్నుపైకి తేల్చివేసి ఒకద్వీపముపైకి త్రోసివేసెను.

ఆ దీవియొక్కతీరము మిక్కిలియెత్తుగను యెగుడు దిగుడుగను వుంది. అందుచే సులువుగా దానిపై కెక్కలేకపోయితిని. అచ్చటి కొన్నిచెట్లవ్రేళ్ళు నాకు మిక్కిలిసహాయపడుటచే నాజీవితము సురక్షితముగా కాపాడబడినది. అతి ప్రయాసతో ఆదీవినెక్కితిని. అచ్చట నీరసముచే సగము చచ్చినవానివలె ఐతిని చలికొనిపోయి సూర్యునియెండవచ్చు వరకు పడియుంటిని. నీరసముచేతను, మిక్కిలి ఆకలిచేతను, అలిసి పోవుటచేతను నడువలేక దేకుచుపోయి తినుటకేమైన దొరుకునేమోనని వెదకితిని. అదృష్టవశముచే నాకు కొన్ని మూలికలువంటివి కనుపించినవి. వాటిని నమిలి అమృతము వంటి రసమును పీల్చుటచే నాకపరిమితమైన బలము, ఆరోగ్యముకలిగినవి. అంత నేను పోయిపోయి, ఆ దీవిలోని ఒక

మైదానములోనికి పోయితిని. అచ్చటికి చాలదూరములో ఒక గుఱ్ఱము మేయుచున్నట్లు చూచితిని. ఆ గుఱ్ఱమున్న చోటునకు పోవుటకై సంతోషము, ప్రాణభయము కూడ కలిగినది. అయిననెట్లో ఆచోటునకు పోయిచేరితిని. ఆగుఱ్ఱము త్రాటితో నొకకొయ్యకు కట్టబడియుండెను. ఆ గుఱ్ఱము మిక్కిలిబలిసి చూచుటకు చాల అందముగా నుండెను.

అంతలో భూగర్భములోనుండి ఒకమనుష్యుడువచ్చి నన్ను గూర్చి చాల అడిగెను. నేను నాసాహస చరిత్రనంతను చెప్పితిని. అంత ఆతడు నన్ను చేతితో పట్టుకొని ఒకగుహా లోనికి పోయెను. ఆ గుహాలో పెక్కుమంది జనులుకలరు. నన్ను చూచి వారును, వారినిజూచి నేనును మిక్కిలి ఆశ్చర్య పోయితిమి. పిమ్మట వారిచ్చిన భోజనమునుచేసి సంతోష ముగా కాలముగడిపితిని. వారితో "మీరెవ్వరు? మీరీ నిర్జనప్రదేశములో యేమిచేయుచుంటిరి?" అని అంటిని. వారు నాతో "మేము యీ ద్వీపముయొక్క రాజైన మిహా రేజు గుఱ్ఱపుకాపలావాళ్ళము. ప్రతియేడును యీ కాలము ననే గుఱ్ఱమును తీసుకొనివచ్చి యిచ్చట కట్టివేయుదుము. అంతలో ఒకనీటిగుఱ్ఱమువచ్చి, యీసుల్తాను గుఱ్ఱముపై పొర్లును. పిమ్మట ఆ నీటిగుఱ్ఱమును బెదరించి సముద్రము లోనికి తోలెదము. అట్లే యీ గుఱ్ఱమును సుల్తానుదగ్గరకు రేపు తీసుకొనిపోవుచున్నామ" ని చెప్పిరి. మరునాడుదయము ననే నన్నుకూడ ఆ ద్వీపమునకు రాజగు మిహారేజు దర్శనము నకు తీసికొనిపోయిరి.

దయావంతుడగు మిహారేజురాజు నాక్షేమమునుగూర్చి నేనెట్లు అడవికి వచ్చినదియు అడిగెను. నాకష్టచరిత్రనంతయు చెప్పి వినిపించితిని. నావిపాధచరిత్రనంతయు విని మిహారేజు మిక్కిలి విచారించెను. నా దురదృష్టమునకు మిగులవగచెను. ఆ రాజు నాపై జాలిపడుటయేగాక, నాకు సర్వసౌఖ్యములు కలుగజేయుటకై మిక్కిలిదయ కరుణకలవారిని నియమించెను. ఆతనివుద్యోగస్తులు, ఆఫీసర్లు నన్నతిజాగ్రత్తగా దయతో చూచి, సర్వసౌఖ్యములు కలుగజేసిరి. నాకన్నిసౌఖ్యము లున్నను, నేనితరదేశములో నుండుటచే నాకేమియు సంతో షములేకుండెను. అచ్చటకు ప్రతిదినమువచ్చు ఓడవర్తకులతో పరిచయము చేసుకొని వారితో మాట్లాడుచుండేవాడను. వారివలన నా స్వదేశమగు బాగ్దాదునుగూర్చి తెలుసుకొను చుండేవాడను. నేనునిత్యము నా దేశము పోవుటకై తరుణము నకై చూడసాగితిని. నేను ప్రతిరోజునను మిహారేజురాజు దర్బారునకుపోయి మా దేశములోని అలవాట్లు న్యాయ చట్టములనుగూర్చి మాట్లాడెడివాడను.

ఆ రాజదాని సమీపముననే మంచిహార్బరుగలదు. ప్రతిదినమును హార్బరునకుపోయి, ఓడవర్తకులను కలుసుకొని వర్తకవిషయములు ముచ్చటించేవాడను. ఒకరోజున మిహారేజు రాజునకుగల కేసయిద్వీపమును చూచుటకుపోయితిని. అచ్చట ప్రతిదినము రాత్రులందు ఢంకానగరాలు మ్రోగించె దరు. అచ్చట నూరుగజముల పొడవుగల పెద్దవలను చూచి తిని. అవి అపరిమితమైన భయంకరముగా నుండును. అవి

పటపటమని చప్పుడుతో యెగిరిపడుచుండును. అట్టి భయంకర మైన యింకొకరకమైన చేపలు పక్షితలలుగలవి గజముపొడ వున్నవి చూచితిని.

అచటినుండి తిరిగివచ్చి, వాడుక ప్రకారము నేను హార్బరునకుపోయి ఓడలోని సరుకుబేళ్లను చూచితిని. ఓడ యజమాని లంగరువేసి ఓడనుఆపి ఓడలోనిసరుకును క్రిందకు దింపించెను. ఆ సరుకు తేరిపారచూచితిని. నాకు చాలఆశ్చ ర్యము కలిగినది. నేను బొల్సారాలో నాపేరుతో సరుకును పంపిన ఓడేఅది! నాపేరునుచూచి చాలసంతోషించితిని. నా ఆనందమునకు మేరలేదు! నేను ఓడనాయకుని యెరుగు దును. అందుచే ఆతని దగ్గరకుపోయి "యీసరుకెవ్వరిదని" యడిగితిని. ఓడయజమాని "ఈసరుకు సిందుబాదను వర్త కునిది. ఆతడు మాతోవచ్చెను. ప్రమాదమున సముద్రములో పడిచనిపోయెను." అని జరిగినదంతయుచెప్పెను. మరియు "ఆతనివర్తక సామగ్రినంతయు అమ్మి ఆసొమ్మును ఆతని కుటుంబములోని బంధువులకుయిచ్చెదను." అని నాతో చెప్పెను. అంత నేను ఓడనాయకునితో "అన్నా! నేనే వర్తకుడగు సింధుబాదును. నేను సముద్రములోబడి నీవు తలచినట్లు చనిపోలేదు. బ్రతికియేయుంటిని; ఆ బేళ్లు సరుకు నాదే!" అంటిని.

అంతట ఓడయజమాని నామాటలువిని, "ఓ దేముడా! ఈ రోజులలో యెవ్వరిమాటలు నమ్మకూడదు. నీమాటల నెవరునమ్ముదురు? నీమాటలలో నాకు నమ్మకములేదు.

మనుష్యులను నమ్మకూడదు ! స్వయముగా నాకళ్ళతో సిందుబాదు సముద్రములో మునిగిపోయి చనిపోవుట చూచితిని. ఈ పడవలోని వర్తకులందరు చూచిరి. మమ్మందరిని మోసముచేయుచు నేనే సిందుబాదు ననుచుంటివే ? ఎంత వింత ? ఇంతమోసమా ? ఇంతకొంటివేషమా ? ఇంతగా అబద్ధములాడి యితరులవస్తువులను చేజిక్కించుకొన జూచితివా ? ఇంత అవివేకమా ? నీవు పైకి సత్యప్రవర్తకునివలె కనపడుచుంటివే ? ఇంతదారుణమైన అసత్యమైన మాటలెట్లు చెప్పగలిగితివి ? " అని కఠినముగా పలికెను.

అంతట నేను ఓడనాయకునితో "అన్నా ! శాంతముగా నేనుచెప్పునది కొంచెము వినుము. నేను సముద్రకెరటములలో బడి రెండుదినములు మహాకష్టముతో యీదుకొనుచువచ్చి ఒకద్వీపముచేరితిని. అచ్చట మిహారేజు గుర్రపుపనివారు నన్నిదేశపురాజువద్దకు తీసుకొనివచ్చిరి. ఎట్లో జీవించితిని. " "ఇది నా సాహసచరిత్ర" అని చెప్పితిని. ఓడలో నన్ను బాగుగా మెరిగిన యితరవర్తకులు కొందరువచ్చి నేను బ్రతికివున్నందుకు మిక్కిలిసంతోషముతో కౌగలించుకొని దేవునిపొగడిరి. ఇదిచూచి ఓడరక్షణాధికారి నామాటలను నమ్మెను. నేను మోసగాడనుకానని తెలుసుకొని మిక్కిలి గౌరవముతో కౌగలించుకొనెను. " దేవుడే నిన్నురక్షించెను ! సిందుబాదు ! యీఓడలోనిసరుకునీదే ! దీనిని తీసుకొని నీయిష్టము వచ్చినట్లు చేసుకొనుము." అనిచెప్పి నాసరుకు యిచ్చివేసెను.

అంతట నేనువెంటనే నావస్తుసామగ్రిలోని కొంత సరుకు కృతజ్ఞతతో ఓడఅధికారికి బహుమతీ యివ్వబోయితిని. అతడుదారుడై నాకానుకను వద్దని నిరాకరించెను. నేను సామానుతీసుకొని మిహరేజుచక్రవర్తికి కొంతబహుమతీ యిచ్చితిని. ఆతడు విలువగల వస్తుసామగ్రినిచూచి మిక్కిలి ఆశ్చర్యపడెను. నాకు సంభవించిన దంతయు చెప్పి, ఓడలోని సరుకు నాకు మరల యెట్లులభించినదో కూడ చెప్పితిని. ఆతడు నా అదృష్టమునకు మిగుల ఆనందించి విపరీతమైన ధనమును యిచ్చెను. ఆరాజు శెలవుతీసుకొని ఓడప్రయాణము సాగించి, నాసరుకు ఆ దేశములో విడుదలచేసితిని.

మరల నా ఓడ నిండ మంచిగంధపుచెక్క, హారతి కర్పూరము, మిరియములు, జాజికాయలు, లవంగములు మున్నగు పరిమళద్రవ్యములు వేసుకొని బయలుదేరితిని. ఓడప్రయాణము చేయుచు చాలదీవులు దాటి తుదకు బాల్సారా చేరితిని. నాసరుకు ఖరీదు సుమారు పదిపదిహేను లక్షల రూపాయలుండును. తిన్నగా నేను వచ్చినందుకు నా కుటుంబములోని బంధువులు, మిత్రులు మిక్కిలి ఆనందించిరి. నాధనముతో భూములుకొంటిని. గొప్పభవనములు కట్టించితిని. సేవకులకు పెట్టితిని. నా దుఃఖములు కష్టములు మరచిపోయి ఆనందముగా జీవించుచుంటిని."

అని సిందుబాదుచెప్పి నూరురూపాయిలు, మంచి బట్టలు హిందుబాదునకు బహుమతీగా యిచ్చెను. ఆ బీద వాడు మిక్కిలి సంతోషముతో యింటికి పోయెను. మరు

నాడు హిందుబాదు మరల సిందుబాదు మేడలోనికి విందు నకై వచ్చెను. విందుభోజనములైన పిమ్మట మరల సిందు బాదు సాహసమైన రెండవ ప్రయాణమును గూర్చిచెప్పెను.

## 2 వ ప్రయాణము

"అన్నా! నా మొదటి ప్రయాణము ముగించినపిమ్మట బాగ్దాదు పట్టణములో సౌఖ్యముగా కాలము గడుపసాగితిని. కాని నా ప్రయాణము ముగిసి యింకను చాలకాలము జరుగలేదు. ఇంటిలో పనిలేకుండ శాంతముగా జీవించుట కొంచెము విసుపు కలిగించెను. మరల వ్యాపారముసాగించి ధనముసంపాదింప బుద్ధికలిగెను. వ్యాపారమునకు తగిన మంచివస్తుసామగ్రినికొని మంచిఓడను కుదుర్చుకొని అందుసామగ్రిని వేయించితిని. నాకు బాగుగా తెలిసిన గొప్ప వర్తకులతో కలిసితిని. మంచిరోజున బయలుదేరి, దైవమును ప్రార్థించి సముద్రముపై ప్రయాణము సాగించితిని. మా ఓడ బాగుగా ప్రయాణము చేయుచుండెను. సముద్రము గాలికూడ చక్కగా ప్రశాంతముగా నుండెను. మేముద్వీపమును విడిచి మరొక ద్వీపమునకు పోవుచు సరుకును అమ్ముచు చాలలాభమును గడించితిని. అనేకరకములైన వస్తువులును కొంటిని.

ఒకరోజున పలురకములైన ఫలవృక్షములుగల దీవికి వెళ్ళిచేరితిమి. ఓడకు లంగరువేసి ఆపి వర్తకుల మందరము ద్వీపములోనికి పోయిచూడగా మనుష్యులుగాని, పశువులు గాని, పక్షులుగాని కంటికికనబడలేదు. మేమాశ్చర్యముతో తిరుగుచు మంచిగాలికై మైదానములో నడచుచుంటిమి. చిన్నచిన్న కాలువలు మంచినీటితో ప్రవహించుచుండెను. మాలో కొందరు పువ్వులుకోసి పోగుచేయుచుండిరి. మరి కొందరు పండ్లేరుకొనుచుండిరి. నేనుమాత్రము నా ఆహారమును తీసుకొనుటకై రెండుచెట్లు కలిసి వింత రూపము కలిగియున్న చోట కూర్చుండి తృప్తిగా భుజించితిని. అచటనే విశ్రాంతికై కండ్లుమూసి నిద్రించితిని. ఇట్లెంత సేపటివరకు నిద్రించితినో చెప్పలేను ! కాని నిద్రమేల్కొని చూడగా పడవ కనబడ లేదు. పైకిలేచి నాస్నేహితులకొరకై చూచితిని ; నలు దిక్కులవెదకితిని.

కాని వారున్నజాడ కూడ తెలియలేదు. నేను సము ద్రమువైపు చూచితిని. బహుస్వల్పకాలములో ఆ నావ నాకంటికి కనబడనంత వేగముగా దూరముగా ప్రయాణము సాగించి పోవుచుండెను. అప్పుడు నాకు కలిగినదుఃఖమును చెప్పలేను. మీరూహించుకొనవలసినదే ! నేను మరణించు టకు సిద్ధముగా నున్నాను. గట్టిగా అరచితిని. విచారముతో రొమ్ముపై బాదుకొంటిని. తలపై మొత్తుకొంటిని. నేలపైబడి దొర్లితిని. అమితమైన దుఃఖముచే రాయివలెనై పోతిని. “ మొదటి ప్రయాణములోని ధనముతో తృప్తిపడక యేల

యిట్లు దురాశపడి మరల యిట్టికష్టములకు పాలైతినా ?" అని నన్ను నేనే మిక్కిలి దూషించుకొంటిని. "నేనెట్లుజీవింతునా ?" అని విచారపడితిని. ఇదంతయు అరణ్యారోదనమే అయ్యెను. బూడిదలో పోసినపన్నీరయ్యెను. "ఇక నాకెవరు రక్షకుడు ?" అని అనుకొని దైవముపై భారమువేసి తిర్గుచుంటిని. ఏమిచేయుటకును తోచక మతిలేనివానివలె తిరుగుచు అచ్చటగల ఒక పెద్దయెత్తైన చెట్టెక్కితిని.

ఆ చెట్టుచిగురు కొమ్మనుండి నలువైపుల "యేదైన సహాయముదొరుకునేమో" యను ఆశతో చూడసాగితిని. మహాసముద్రములోని నీరు – ఆకాశము తక్క మరేమియు కనబడలేదు. కాని భూమిపైన యేదోయొక పెద్దతెల్లని ఆకారముకనబడెను. చాలదూరముగానుండుటచే అదేమియో స్పష్టముగా తెలియలేదు. అదేదో తెలుసుకోవలెనని కోరిక కలిగినది.

వెంటనే నేను చెట్టుదిగి పెద్దఆశతో తెల్లని వస్తువున్న చోటునకు నడచి పోవుచుంటిని. అట్లునడచి, నడచి దాని దగ్గరకు సమీపించితిని. చూడగా మిక్కిలి యెత్తుగ విశాలముగ గుండ్రముగా, నున్ననున్నగా వున్నయొక పెద్దగుండువంటిది కనబడెను. దానిచుట్టు తిరిగి లోనికి పోవుటకు మార్గమున్నదేమోనని చూచితిని. అట్టిదారేదియు లేదు. దానిపైకెక్కుటకు కూడ, నున్నగానుండుటచే వీలులేకపోయినది. అది యెంతలేదన్నను యాభై అడుగులు గుండ్రముగానున్న తెల్లనిగుండు. అదియొకపక్షిగ్రుడ్డై యుండునని తలచితిని.

ఇంతలో సూర్యుడస్తమింప బోవునట్లు ఆకాశము నల్లని మబ్బుతో ఆక్రమింపబడినట్లు చీకటిపడినట్లు కనబడెను. ఇంతలో అంతచీకటిగానై పోవుటకు ఆశ్చర్యపడుచు చూచు చుంటిని. పర్వతముతో సమానమైనపక్షి పెద్దరెక్కలు జాపుకొని యెగురుచు నావైపునకే వచ్చుచుండెను. ఆ గండభేరుండ పక్షి యెగురుటచే కలిగిన పెద్ద "ఓరను" ధ్వనికి, మిక్కిలి భయపడి వదిగి కూర్చుంటిని. ఆ భయంకరమైన పక్షి తిన్నగా వచ్చివచ్చి తెల్లనిగ్రుడ్డుదగ్గర వ్రాలెను. అంతనేను "ఆ పెద్ద తెల్లనిగుండు దాని గ్రుడ్డైయుండునని దానినెత్తుకొని పోవుటకై గండభేరుండపక్షి వచ్చినదని" తలచితిని. నాజీవితములో అంత వింతపక్షిని చూడలేదు; వున్నదని వినలేదు. ఆపక్షి యెగిరి గ్రుడ్డుప్రక్కగా నిలచెను. నేను నెమ్మదిగా పాకుచు ఆ గ్రుడ్డు చెంతకు పోయితిని. నాముందుగా ఆ పెద్ద పక్షి కాలున్నది. ఆ కాలొక పెద్దచెట్టుమానువలె నున్నది. "ఆ మహాపక్షి నన్నుకూడ తీసుకొని పైకెగిరిపోవునని యీయెడారినుండి బైటపడి బ్రతుకవచ్చునని" తలచితిని. నా తలపాగా గుడ్డనువిప్పి, నా నడుమునకు చుట్టబెట్టి పక్షి కాలునకు గట్టిగా కట్టితిని. నేనుభూమిపై బోరగిలిపడుకొని యుంటిని.

ఈ విధముగా రాత్రంతయు గడిచెను. మరునాడుదయముననే ఆ పక్షి ఆకాశములోనికి యెత్తుగా యెగిరిపోయెను. నేను భూమినికాని, సముద్రమునుకాని, చూడలేనంత యెత్తునకు యెగిరిపోయి యుంటిని. ఒక్కక్షణములో హఠాత్తుగా,

ఆ పక్షి మిక్కిలివేగముతో క్రిందికి దిగిపోయెను. ఆ తొణుకునకు నాకుస్మృతి తప్పిపోయినది. నాకు తెలివికలిగి చూడగా నేను భూమిపై నున్నట్లు తెలుసుకొంటిని. వెంటనే త్వరగా నాకట్లను విప్పివేసుకొంటిని. నాకట్టు ముడివిప్పి విప్పకుండగనే, అంతలో ఆ పక్షి ముక్కునకు ఒక గొప్పపామును కరచుకొని పైకియెగిరిపోయెను.

ఇక నాదురదృష్టదశ నేమని చెప్పుదును! నిర్మానుష్యమైన యెడారిలోనుండి ప్రాణముతో తప్పించుకొని బయటపడదలచిన నేను మహాఅగాధమైన, భయంకరమైన కొండలోయలో పడియుంటిని. నేనున్న స్థలమునకు చుట్టును యెత్తుగా పర్వతములే! అవి మేఘమును తాకునంత యెత్తుగా నున్నవి. ఆ పర్వతముల నెక్కుటకు వీలులేనంత నిలువుగా నున్నవి! ఆ మహాభయంకర స్థలమునుండి ప్రాణములతో అపాయము తప్పించుకొని బయటపడుట చాల దుస్సాధ్యము! నాకు యీమరొక క్రొత్తచిక్కైన ఆపదవచ్చిపడినది. నిర్మానుష్యమైన యెడారినుండి వచ్చి, యీపర్వతలోయలో పడుటవలన ప్రాణాపాయము తప్పినట్లుకాని, లాభించినట్లుకాని కనబడలేదు. ఈ మార్పువలన విచారము హెచ్చిపోయినది.

నేనిట్లు తలచుకొనుచు దుఃఖముతో ఆ లోయలో నడవసాగితిని. నా ఆశ్చర్యమునకు మేరలేదు! నాఆనందమునకు పరిమితిలేదు. విపరీతమైన పెద్దవి, అనేకరకములైనవి కన్నులు మిరిమిట్లు గొల్పు వజ్రములు, రత్నములు, రాసులుగా, దకుప్పకుప్పలుగా కనబడెను. వాటిని చూచి అపరిమితానం

మును పొంది, యింకను కొంతదూరము నడచితిని. ఎక్కడ చూచినను, వజ్రములే! రత్నములే! మణులే! పోగులై యుండెను. ఇంకను అక్కడ మరికొన్ని ఎర్రనివి, నల్లనివి, తెల్లనివి కనబడినవి. వాటిని చూడగానే నా ఆనందము, ప్రాణములు కూడ ఒక్కసారిగా యెగిరిపోయినవి! అవన్నియు మహాభయంకరములైన పెద్దపెద్దపాములు! ఆ భయమును నేను చెప్పలేను. నాకాళ్లు యెక్కడకు పోవుటకును ఆడ కున్నవి. రక్తము చలించుట మానివేసినది. నేను కొయ్య బొమ్మవలె నిలబడిపోతిని. ఆ పాములు తాటిచెట్టంతలావున ఇరవై ముప్ఫైగజముల పొడవుగా నున్నవి. అవి అవలీలగా పెద్దయేనుగులను సహితము, ఒక్కసారిగా మ్రింగగలవు.

ఆ పెద్దపాములు ఈ గండభేరుండపక్షికి భయపడి పగటి పూట కొండకన్నములలో దాగియుండును. రాత్రులందు ఆహారమునకై పైకివచ్చి తిరుగుచుండును. నేను పగటిపూట కనుమలో తిరుగుచు రాత్రులందు యేదోగుహలో దూరి దాగొనుచుంటిని. ఆగుహాద్వారమునకు పాములు దూరి రాకుండ పెద్దరాతిబండను అడ్డముగా పెట్టుకొనువాడను. నాదగ్గరున్న ఆహారమును కొంచెము కొంచెముతిని, యెట్లో జీవించుచుంటిని. కాని రాత్రులందు సర్పభయముచే నిద్ర మాత్రము పోవుటలేదు. ఉదయమున పాములుపోయిన పిమ్మట గుహనుండి పైకివచ్చి లోయలో వజ్రములమీద చాలదూరము నడిచి పోవుచుండేవాడను. కాని యొక వజ్ర మైనను ముట్టుకొన బుద్ధిపుట్టలేదు. నాకు జీవించెదననే ఆశ

యెంతమాత్రమును లేదు. ఒకనాడు ఆహారముతినిన వెంటనే నిద్రలేనికారణమున కళ్లుమూసుకొని పోయినవి. కొంచెము కునుకుపట్టినది. ఇంతలో పెద్దచప్పుడుతో నాప్రక్కనే గభీమని " యేదో పడినది. ఆధ్వనితో నేనుకళ్ళు విప్పి మేల్కొని చూచితిని. అది యొక పెద్దమాంసపుముక్క. ఇంకను అట్టిమాంసపుముక్కలే యెత్తైన పర్వతముపై నుండి క్రిందకు చాలచోట్ల పడెను.

వజ్రాలవర్తకులు కొండలోయలోని వజ్రములను సంపాదించుటకై యిట్టియుక్తులనే పన్ని వాటినుపయోగింతురని యిదివరలో కథగా వినియుంటిని. కాని అదియిప్పుడు నాకునిజమైనది. అట్లే యిప్పుడు నిజముగా యీపర్వత లోయ పరిసరములకు వర్తకులువచ్చి మాంసఖండములను లోయలోనికి విడిచిరి. ఆ మాంసమునకు క్రిందపడుటలో లోయలోని వజ్రములు అంటుకొనును. పెద్దరాబందులు మున్నగు పక్షులు, లోయలోని మాంసమును ముక్కుతో కరచుకొని పర్వతములపై గూళ్ళలోని పిల్లలకు తీసుకొనిపోవును. అప్పుడు వర్తకులు చప్పుడుచేసి ఆ పక్షులను బెదరించి మాంసపుముక్కకు అంటుకొనిన వజ్రములు, రత్నములు తీసుకొందురు. ఇట్టి కపటోపాయముచేతనే అనేకవర్తకులు అపరిమిత ధనమును సంపాదించిరి. మనుష్యమాత్రులు చేరలేని చోటులనుండి రత్నములు, వజ్రములు విలువగలరాళ్లను, యిట్టి మాయ పన్నాగములచే సంపాదింతురు. ఇంతవరకును నేనీ పర్వత లోయనుండి బయటపడి జీవింతునను ఆశలేదు. ఇదియే

నామరణస్థలమని సమాధియని తలచితిని. కాని నాకిప్పుడా బుద్ధిమారినది. జీవితాశ కలిగినది. నాకొక ఆలోచన తట్టినది. ఆ లోయలోపడిన మాంసఖండములే నాకు ప్రాణరక్షణ కలుగ జేయగలవను ఆశకలిగినది.

వెంటనే నేను పెద్దపెద్దవజ్రములను యేరి నాతోలు సంచి నిండాపోసి బిగించితిని. పిమ్మట పెద్దబరువైన మాంసపు ఖండమును తీసి దానిని నాతలపాగాగుడ్డతో గట్టిగా శరీరముతో అంటగట్టితిని. వజ్రాలసంచిని పడిపోకుండ నాసరుకునకు బిగించికట్టితిని. నాముఖమును భూమివైపుపెట్టి పడియుంటిని. ఇంతలో దైవకృపచే పెద్దపెద్ద భయంకరమగు గండభేరుండపక్షులు, రాబందులు, ఆ లోయలోనికి ఆహారమునకై వచ్చి దిగినవి. అన్నిపక్షులును మాంసఖండములను ముక్కునకరచుకొని పైకెగిరిపోయినవి. నన్నొకబలమైన పక్షి మాంసము ముక్కుతోకరచి పట్టుకొని యెగిరి పర్వతముపైకి పోయినది. అది తిన్నగాపోయి దాని గూటిదగ్గరజేరెను. వర్తకులు పక్షులను బెదరించుటకై పరుగుపరుగునవచ్చి పెద్ద చప్పుడుచేసి కేకలుపెట్టి బెదరించిరి. ఆ పక్షులు తమ ఆహారమగు మాంసఖండములను విడిచిపెట్టి యెగిరిపోయినవి. ఒక వర్తకుడు నేనున్నగూటి దగ్గరకువచ్చి నన్నుచూచి మిగుల భయపడెను. భయము తగ్గినపిమ్మట నా చెంతకువచ్చెను. ఆతడు నేనెట్లక్కడకు వచ్చిపడితినో నాగతియేమో అడిగి తెలుసుకొనకయే, నాతో పోట్లాడసాగెను. ఆతడు "నా వజ్రములు నీవేదొంగతనముగా తీసుకొనుచుంటివా? ఆ పక్షిని

నేను బెదరించితిని. ఆ వజ్రములన్నియు నావే ?" అని తగువు లాడజొచ్చెను.

నేనాతనితో "అన్నా ! తొందరపడి కంగారుపడకుము. నా కష్టచరిత్రవినినచో నీవిట్లు నాతో దెబ్బలాడవు. నీకు నాకు కూడ చాలినన్ని వజ్రములు మూటకట్టి తెచ్చితిని. ఇచ్చటకు వచ్చిన వర్తకులందరి వజ్రములు పోగుచేసినను, నాదగ్గరనున్న వజ్రములన్ని యుండవు. నీకుకావలసినన్ని యిచ్చెదను. నేనీపర్వతలోయలోనుండి పెద్దవి, మంచివి యేరి మూటకట్టి తెచ్చితిని" అని చెప్పి సంచిలోనున్న వజ్రములను వానికి చూపించితిని. ఇంతలో యితరవర్తకులుకూడ గుంపుగా వచ్చి ఆ వజ్రములుచూచి మిక్కిలి ఆశ్చర్యపడిరి. "ఇవి నీకెట్లు వచ్చినవి ?" అని యడిగిరి. నేను నా సాహసమైన కథను చెప్పగా విని వారుమరింత వింతతో ఆశ్చర్యపడిరి. నాప్రాణ రక్షణకై నేను చేసిన యుక్తికి, సాహసమునకు నన్ను మిక్కిలి కొనియాడి ఆనందించిరి. మేమందరమును కలిసి వారిబసకువెళ్ళిన పిమ్మట వారికి నాసంచి తెరచి వజ్రములు చూపించితిని. మిక్కిలి పెద్దవైన వజ్రములు చూచి వారు నిర్ఘాంతపోయిరి. ఏ మహారాజు మందిరములందును మేమిట్టివజ్రములు చూడలేదని ఆశ్చర్యపడిరి. నాకు రక్షకుడైన వర్తకునకు మనసు తృప్తిఅగునట్లు ఆతనికి అపరిమితమైన వజ్రములనిచ్చి సంతోషపరచితిని.

ఆ వర్తకుడు "యేప్రయాణములోను యింతవిలువగల వజ్రములు నాకు దొరకలేదని" అమితానందమును పొందెను.

ఆ రాత్రి వర్తకులతో గడిపి, నాసాహసచరిత్రను మరల వారికి చెప్పితిని. వారిట్టి చిత్రచరిత్రను వినలేదని, దేవుని పొగడిరి. నేనుకూడ తలవనితలంపుగా ఆ మరణస్థలమునుండి బయటపడి మరలజీవించుటచే అమితానందమును పొందితిని. మరపురాని ఆ భయకంపిత లోయనుండి బయలుపడుట కల యేమో! అని తలచితిని. నేనెట్లు సురక్షితముగా ఆపదలను తప్పించుకొనగలిగితినో, నాకేనమ్మకము కలుగుటలేదు! మహాశ్చర్యమైనది. వర్తకులందరు చాలరోజులవరకు అక్కడనే బసచేసి, మరల మరల పర్వత లోయలోనికి మాంసఖండము లను విసరి వాటివలన చాలవజ్రములు సంపాదించుకొనిరి. వారు తృప్తినొందినపిమ్మట ప్రయాణమునకై సిద్ధమైరి.

ఆ వర్తకులతో బయలుదేరి నేను రోహాద్వీపమునకు చేరితిని. అచ్చటగల పెద్దచెట్లు హారతికర్పూరమును యెక్కువగాయిచ్చును. అందుచే ఆ ద్వీపమునకు కర్పూరద్వీపమని పేరు. ఆ చెట్లనీడను వందలకొద్ది జనులు సుఖముగా కూర్చుండ వచ్చును. ఆ చెట్లనుండి రసము వచ్చును. ఆరసమునే హారతి కర్పూరముగా తయారుచేయుదురు. ఆ దీవిలో యేనుగును సాహసముగా చంపగల జంతువుకలదు. దానిముట్టిమీద వాడి యైన కొమ్ముకలదు. ఆ కొమ్ముతో యేనుగును అవలీలగా పొడిచిచంపును. ఆ జంతువు పెద్ద దున్నపోతువలె నుండును. ఆ ద్వీపములోని పెద్దపక్షులు యేనుగును, యీదున్నపోతు వలె నుండుజంతువును కూడ కాళ్ళతోపట్టుకొని, ఆకాశము

లోనికి యెగిరిపోగలవు. అంతబలమైనవి. ఇంకను ఆ ద్వీపములో అనేక చిత్రవిచిత్రములను చూచితిని. ఆ ద్వీపములో నా వజ్రములను వర్తకులకమ్మి మగల మంచి వస్తుసామగ్రిని కొంటిని. అచ్చటనుండి మరికొన్నిదీవులకు పోయి, వాటిని విక్రయించి చాలధనమును సంపాదించితిని. చాలవర్తకస్థలములకు పోయి, అపరిమిత ధనముతో కొలదికాలమునకు మరల బాల్సొరావచ్చి చేరితిని. అచ్చటనుండి నా స్వస్థలమగు బాగ్దాదు పట్టణమునకు వచ్చితిని.

ఇంటికి వచ్చినవెంటనే బంధుమిత్రులందరును మిక్కిలి సంతోషించిరి. నేను బీదసాదలకు అపరిమితముగా భోజనములు పెట్టితిని. కష్టములు తొలగించిన దైవమునకు ప్రార్థనలు చేసితిని. అంత కష్టపడి ప్రాణాపాయములను తప్పించుకొని శ్రమకోర్చి గడించిన ఐశ్వర్యమిదియే! నాకష్టములు ఫలించినవి. పట్టినది బంగారమైనది. అపరిమితమైన ధనలాభము కలిగినది. అని సిందుబాదు ఆతని ప్రయాణమును గూర్చి చెప్పెను. నూరు రూపాయలు హిందుబాదునకు యిచ్చి ఆతనిని సంతోషపరచెను. హిందుబాదును మరునాడు మరల విందునకు రమ్మని పిలచెను. హిందుబాదు సంతోషముతో సిందుబాదు యింటికి విందునకు వచ్చెను. విందు భోజనము లైనపిమ్మట సిందుబాదు ఆతనితో యిట్లు చెప్పదొడగెను. హిందుబాదు బీదతనమును మరచిపోయి సిందుబాదు సాహస చరిత్రను వినుచు ఆనందించసాగెను.

# 3 వ ప్రయాణము

"అల్లా! నాఆనందమయ జీవితమువలన యిదివరలోని నా కష్టములు మరచిపోయితిని. నాకు కలిగిన ప్రాణహాని దిగులు మహాభయము తగ్గినవి. నేను మంచి బలము-ఆరోగ్యము యవ్వనము కలిగియుంటిని. ధైర్యసాహసములు మరల కలిగినవి. నిర్వ్యాపారముగా తిని కూర్చుండుట చాలహీనమని తోచినది. ఎన్నికష్టములు కలిగినను సహించి నా ధనమును వృద్ధి చేయ సంకల్పము కలిగినది. మరల వర్తకవ్యాపారములు చేయ సమకట్టితిని. బాగ్దాదునుండి బయలుదేరి బాల్సారా చేరితిని. వివిధరకములైన విలువగల వస్తువులునుకొని ఓడపై వేసుకొని సముద్రముపై ప్రయాణము సాగించితిని. చాల దూరము తీరమునగల పట్టణములలో వర్తకముచేయుచు పోయితిని

ఇట్లుండ ఒకరోజున ఆ మహాసముద్రములో మాకు గొప్పతుపాను సంభవించినది. కల్లోలముగా వున్నసముద్రములో మాకు మార్గము తప్పిపోయినది. ఆ తుపాను చాల రోజులవరకట్లే యుండిపోవుటచే మేముచేయునదిలేక సమీపమున గల ఒకద్వీపమునకు వెళ్ళితిమి. కాని ఓడకెప్టెనుకెంతమాత్రము ఆదీవిదగ్గరకు పోవుట కిష్టములేదు. అయినను మేమక్కడే లంగరువేసి ఓడను ఆపవలసివచ్చినది. ఒడకెప్టెను మాతో " యీదీవిలోను చుట్టుపట్లనున్న దీవులలో నివశించు

వారందరును అడవిమనుష్యులే! వంటినిండ పెద్దబొచ్చు వెంట్రుకలుగలిగి పొట్టిగానుందురు. మిడుతలదండువలె సమూహముగావచ్చి మనపై బడి చంపుదురు. మనమెదుర్కొనలేము. మనఓడకు రక్షణలేదు. మనమేమియుచేయలేము." అని చెప్పెను.

ఆతనిమాటలు వినినతోడనే ఓడలోని మేమందరమును మిక్కిలికంగారుతో భయపడి పోవుచుంటిమి. ఇంతలో ఓడ యజమాని చెప్పినట్లుగానే భయంకరులైన అడవిమనుష్యులు వచ్చిరి. వారు యెఱ్ఱనిబొచ్చుకలిగిన వారు. రెండడుగులు యెత్తున్నవారు లెక్కలేనంతమంది సముద్రమీదుచు మాఓడ వైపునకు వేగముగా వచ్చుచుండిరి. క్షణములో మాఓడను చుట్టుముట్టి పైకెగ్రబాకిరి. వారు పడవయెక్కుట మేము చాల ఆశ్చర్యముగా చూడసాగితిమి వారేదో మాతో మాట్లాడిరి. కాని వారిభాష మాకర్థముకాలేదు. వారు ఓడ పైకి వచ్చినంతనే మేము మిక్కిలి భీతిచెందితిమి. మారక్షణకై మేమేమియు చేసుకొనలేకపోతిమి. వారు క్రూరకృత్యములు చేయకుండ ఆపలేకపోతిమి. వారు చాలమందివుండుటచే, మమ్ము లెక్కచేయలేదు. తెరచాపలు కోసిపారవేసిరి. మోకుత్రాళ్ళు తెంపివేసిరి. మమ్మందరిని బలవంతముగా ఓడలోనుండి క్రిందకిదింపివేసిరి. వెంటనే మాఓడను వారు వచ్చిన దీవికి లాగుకొని పోయిరి.

మేము మాత్రమచ్చటనే విడిచిపెట్టబడితిమి. భయంకరమగు ఆ స్థలమంటే వుండిపోయి మాదుఃఖమును, ఆపదను

సహించవలసివచ్చినది. మేమందరముకు చాలభయపడుచునే ఆ దీవిలోనికి నెమ్మదిగాపోయితిమి. అచ్చట మాకు కొన్ని రకములైనపళ్లు, మూలికలు, దుంపలు, కనబడినవి. వాటినితిని కొలదిరోజులు జీవించితిమి. కానిబాధ నిశ్చయమని తెలచితిమి. నిరాశతో మేమట్లు పోవుచుండ కొంతదూరములో ఒక పెద్ద మేడ కనబడెను. నెమ్మదిగా దానిచెంతకు పోయిచేరితిమి. దగ్గరకుపోయిచూడగా యెత్తుగా, బలముగా కట్టబడిన గొప్ప కోటవలె నుండెను. దానికి నల్లని పెద్దమానుగేటుకలదు. ఆగుమ్మము తెరచియుండుటచే లోనికి ప్రవేశించితిమి. అందు మిగులవిశాలమైన గదులు మంటపములు చూచితిమి. ఆమంట పములు ప్రక్కనే, మనుష్యుల యెముకల ప్రోగులు, మరొక వైపున యినుపకాడలు, పెద్దపొయ్యిలు కనబడెను. భయంకర మైన యీవింత మంటపమును చూడగనే వళ్లుకంపించినది. కాళ్ళు తడబడినవి. ప్రయాణపు బడలికచే కాళ్ళు ముందునకు నడచుటకు సాగుటలేదు. మరణభయముతో నేలపై కదల కుండ చాలసేపటివరకు పడియుంటిమి. భయముచే వణికి పోవుచుంటిమి.

ఇంతలో సూర్యుడస్తమించెను. చీకటి వ్యాపించెను. మేము విచారముతో అట్లే పడియుంటిమి. ఆ మేడలోని గది తలుపులు కిర్రుమని పెద్దధ్వనితో తెరువబడెను. ఆ గదిలో నుండి తాటిచెట్టంత పొడవు మిక్కిలి నల్లనిశరీరముగలిగి, భయంకర రూపుడొకడు పైకివచ్చెను. ఆతనికి ఒకకన్ను మాత్రమే కలదు. చింతనిప్పువలె యెర్రగ ఆకన్నునుదుటిపై

నుండుటచే, మిక్కిలి భయంకరముగా కనబడుచుండెను. ఆతనిపండ్లు చాలాపొడుగుగాను వాడిగానువుండి వికృతాకారముగా వున్నవి. పెదవులు చాలక్రిందివరకు వ్రేలాడు చుండెను. చెవులుచేటలవలె వెడల్పుగావుంది. భుజములపై నుండి వ్రేలాడుచుండెను. ఆతనిగోళ్లు సూదిగా, పొడవుగా, వంకరతిరిగి పులిగోళ్ళవలెనుండెను. ఆ బ్రహ్మరాక్షసిని చూడగనే, మాకు ప్రాణములు పైకెగిరిపోయినవి. స్మృతి తప్పి కదలకుండ చచ్చినట్లు పడియుంటిమి. అప్పటి మా బాధ చెప్పతరముకాదు కొంతసేపటికి మాకు మరల ధైర్యము, శక్తి, కలిగిన తరువాత కళ్ళువిప్పి చూచితిమి. ఆ రాక్షసుడు మంటపములో కూర్చుండి, నిదానముగా మావైపే కన్నువిప్పి చూడసాగెను. ఆతడు సంతోషము పట్టజాలక మమ్ము తేరిపారజూచి లేచినిలబడి మా దగ్గరకువచ్చి నిలచెను.

ఆ రాక్షసుడు పొడుగైనచెయ్యిజాపి నన్నుమెడపట్టుకొని పైకెత్తి యిటు అటు గుండ్రముగా త్రిప్పిచూచెను. నావళ్ళు నొక్కిచూచెను. నేను చాలసన్నముగ నుంటిని; యెముకలపోగు, తోలు, తప్ప మాంసము లేనివాడనగుటచే పనికిరాదని తలచి క్రిందకు దింపివదిలివేసెను. ఆతడిట్లే మాలో ప్రతివక్కరిని యెత్తి పరీక్షచేసి చూచివదిలెను. మా అందరిలోను ఓడకెప్టెను మిక్కిలిబలశాలి; కండపుష్టిగలవాడు మంచిపొడగరి. అందుచే ఆతనిని చేతితో పిచ్చికను పట్టుకొనునట్లు యెత్తిపట్టుకొని ఒక యినుప నారసమునకు గట్టిగా గ్రుచ్చెను. పెద్ద సిహ్మంలమంటచేసి దానిపై ఆతనిని

కాల్చుకొని తిని రాత్రిభోజనము తృప్తిగా ఆరగించెను. ఆ రాక్షసుడు భోజనము ముగించి యెప్పటివలె మంటపము పైకిపోయి మేఘగర్జనవంటి ధ్వనితో గుర్రుపెట్టుచు నిద్ర పోయెను. ఆతడు గాఢనిద్రనుండి మరునాటి వుదయమువరకు మరలలేవలేదు. మాకుమాత్రము మా స్నేహితుడు పోయి నందుకు విచారము, అపరిమితమైన భయకంపరము కలిగినది. ఈ రాక్షసకృత్యమును చూచినతరువాత మాకళ్ళకు మూత పడలేదు. కునుకురాలేదు. సరేగదా యెంతగా భయపడితిమో కూడ చెప్పలేను సూర్యోదయమైన పిమ్మట ఆ రాక్షసుడు లేచి మమ్మల్ని కోటలోనే విడిచిపెట్టి పైకిపోయెను.

ఆతడు మాకంటికి కనబడనంతదూరము పోయెను. తరువాత మాకు కొంత భయముతగ్గినది. అప్పుడు ఊపిరి గట్టిగా పీల్చుకొంటిమి. మాకు కలిగిన ఆపదకు ఒకరికంటె ఒకరెక్కువగా విచారపడజొచ్చితిమి. చాలమంది మేము వున్నను ఒక్కశత్రువైన రాక్షసునిబాధలనుండి తప్పించుకొన లేకపోవుటకై విచారించితిమి. మాంలో అనేక ఆలోచనలు కలిగినవి. కాని వాటివల్ల యేమియు లాభము కలుగలేదు. దేవునిపై భారమువేసి ఆ ద్వీపములోతిరిగి పండ్లు మూలికలు తిని, ప్రాణములు నిల్పుకొంటిమి. సాయంకాలము సురక్షిత మైన చోటునకై వెదకితిమి కానియేదియు దొరకలేదు అందుచే రాత్రికి ఆ కోటలోనికే రాకతప్పినదికాదు. ఆ క్రూర రాక్షసుడు యథాప్రకారముగా మాలోమరొకరిని చంపి కాల్చుకొని తిని గాఢనిద్ర పోయెను. ఉదయముననే ఆతడు

పైకి వెడలిపోయెను. మా జట్టులోని వారు యీ భయకంపిత మైన ఆపదనుచూచి సహించలేకపోయిరి. ఇట్లు రాక్షసునిచే దారుణముగా చంపబడి చచ్చుటకంటె సముద్రములోబడి మరణించుటే మేలని తీర్మానించిరి. మాలో కొందరు "మనమే స్వయముగా ఆత్మహత్య చేసుకొనిచచ్చుట చేయకూడనిపని ఈ కఠినరాక్షసుని క్రూరమరణమునుండి తప్పించుకొను వుపాయము ఆలోచించి కనుగొనుట మంచిమార్గము" అని చెప్పిరి.

అందుపై నేను మా వారికి యుక్తితోకూడిన వుపాయ మొకటి కలదని చెప్పగా వారు దాని నంగీకరించిరి. అట్లు చేయుటకు ఒప్పుకొనిరి. "అన్నలారా! సముద్రతీరమున విప రీతమైన కలపవున్నది. దాన్ని మనము వుపయోగించు కొని, చిన్న చిన్న తెప్పలుగాకట్టి యుంచెదము. అవుసరమురాగానే వాటిని మనము పారిపోవుటకై వుపయోగింపవచ్చును. మనలో యిద్దరు స్నేహితులను క్రూరముగా చంపితినిన రాక్షసునకు తగినశిక్ష చేయుదము. అదిఫలించెనా? సురక్షితముగా మన మిచ్చుటనే, యేదైన పడవవచ్చువరకు ఆగియుండవచ్చును. అట్లుకానిచో యీ తెప్పలతో సముద్రముపై తేలుచు కొంత కాలము గడిపి అప్పుడు సముద్రములో ప్రాణములు అర్పింతము." అని చెప్పితిని. అంతమేము ముగ్గురు మనుష్యులు కూర్చుండి తేలుచుపోవుటకు తగినట్లుగా చాలచిన్న తెప్పలను తయారుచేసి యుంచితిమి. పిదప చేయునదిలేక చాలభయ ముతో, మేమారాక్షసుని కోటలోనికిపోయి చేరితిమి. అటు

పిమ్మట క్రూరరాక్షసుడు వచ్చి మాలో ఒకనిని యినుపనారసము నకు గ్రుచ్చి కాల్చుకొని తిని, గుర్రుపెట్టి నిద్రపోయెను. మరల మాలో ఒకస్నేహితుడు క్రూరముగా చంపబడుట మేముచూడక తప్పినదికాదు.

ఆక్రూరరాక్షసునిపై మాపగతీర్చుకొనుటకై ఒక పన్నుగడ పన్నితిని. దుష్టరాక్షసుడు గుర్రుపెట్టి నిద్రించు నప్పుడు మాలో ధైర్యవంతులమగు పదిమందిమనుష్యులము ఒక్కొక్క యినుపవూసను తీసుకొంటిమి వాటిమొనలు నిప్పులో పెట్టి యెర్రగా కాల్చితిమి. అందరముకలిసి ఒక్క మారుగా ఆకాలిన వూసలనుపట్టుకొని రాక్షసుని కంటిలో గ్రుచ్చి, గ్రుడ్డివానిగా చేసితిమి. ఆ రాక్షసుడు బాధకుతాళ లేక భూమికంపించునట్లు కేకలుపెట్టుచు లేచి చేతులుజాపి మమ్ముపట్టుకోబోయెను. కాని మేము వానిచేతులలో పడక మూలదాగియుంటిమి ఆశడు మమ్ముపట్టుకొనలేక విసిగి గుమ్మముపరకు చేతులతో తడుముకొనుచు వెళ్ళి గట్టిగా మూల్గుచు వెలుపలకు పోయెను.

రాక్షసుడు పోయినవెంటనే మేము సముద్రతీరమునకు పరుగెత్తుచుపోయి మా తెప్పలను సముద్రపునీటిలో వేసితిమి. "ఉదయమున వెలుగురాగానే రాక్షసుడు యితరులసహాయ ముచే వెంటాడివచ్చిన మేము సముద్రములో యీదుచు పోవచ్చునని అట్లురాకపోయిన రాక్షసుడు చచ్చుటచే ఆ దీవి లోనే ఆగిపోవచ్చునని" వూహించితిమి. ఆక్రూరరాక్షసుడు బలమైన యిద్దరురాక్షసుల సహాయముతో మేమున్న సముద్ర

తీరమునకు మూల్గుచు గబగబపరుగెత్తి వచ్చుచుండెను. వానినిచూచి మేముక్షణములో తెప్పలపైనెక్కి తీరము విడిచి, సముద్రములోనికి పోతిమి. మేముపోవుచుండుటచూచి రాక్షసులు పెద్దపెద్దరాళ్ళు తీసుకొనిరి. నీటిలోదూకి మాతో కూడ సముద్రమధ్యకు లోతునీటిలోనికి వచ్చి మా తెప్పలపై రాళ్ళువిసిరిరి. ఆరాళ్ళదెబ్బలకు తట్టుకొనలేక అన్ని తెప్పలు మునిగిపోయినవి. అందులో నాస్నేహితులందరును మునిగి పోయిరి. దైవవశముచే నా తెప్పమాత్రము మునిగిపోలేదు. మా తెప్పలో నేను, నాతో మరియిద్దరు స్నేహితులు మాత్రమే మిగిలితిమి. మేము శక్తికొలది మా తెప్పను నడుపు కొనుచు రాక్షసులచేతిలో బడక తప్పించుకొని పోయితిమి. ఆ మహాసముద్రములో కెరటములకు, పెద్దగాలికి బలిచేయబడి అల్లల్లాడుచు కొట్టుకొనుచుంటిమి. గాలియెటుకొట్టివేసిన అటు కొట్టుకొని పోవుచు ఒక రాత్రియు పగలును క్రూరజంతువుల మధ్య చావుబ్రతుకులమధ్య యేమియు నిశ్చయింపలేక తేలుచు గడిపితిమి. అదృష్టవశముచే మరునాడొక దీవిని చేరి తిమి. మహాసంతోషముతో ఆ ద్వీపములో దిగి తిరుగుచు పండ్లుకోసుకొని తింటిమి. ఆ పండ్లవలన మాకు ఆరోగ్యము, బలము, ఉత్సాహము, ఆనందము కలిగెను. మరల జీవించ వచ్చునని తలచితిమి.

ఇంతలో సాయంకాలమగుటచే అచ్చట సముద్రతీరము ననే నిద్రించితిమి. రాత్రి యెచటనుండియో తాటిచెట్టువలె లావుపొడుగుగల ఒక పెద్ద త్రాచుపాము "పెళపెళ" మను

పెద్దచప్పుడుతో బుసకొట్టుచువచ్చినది. ఆ చప్పుడు విని మేము కంగారుతో లేచి మేలుకొంటిమి. ఆమహాసర్పము మా స్నేహితులలో ఒకనిని అతడెంత ప్రయత్నించినను కేకలువేసి బెదరించినను విడువక పట్టుకొని సమిల్రమింగివేసినది. పాము కరకర నములునప్పుడు మా స్నేహితుని యెముకలు విరిగిపోవు చప్పుడు కూడ మాకువినబడినది. మేము విచారముతో చాలభయపడి పోయితిమి. మిగిలిన యిద్దరము ఆ చీకటిలో చాలదూరము పరుగెత్తిపోతిమి. మరునాడు మరల ఆ పెద్దపాము కనబడినది. నేను భయముతో వణుకుచు "ఓ దైవమా! ఇంకను నాకు యెట్టి ఆపదలురానున్నవి? నిన్నటిరోజున క్రూరరాక్షసుని బాధనుండి అపాయకరమగు సముద్రకెరటములనుండి, యెట్లో రక్షింపబడితినని సంతోషించితినే! కాని యిప్పుడు మరల యింకొక గొప్పఆపాయములో పడిపోతినా? ఆహా! రక్షకా! యెట్లుకాపాడెదవో?" అని దేవుని వేడుకొనుచు నడచిపోవు చుంటిని. నా స్నేహితుడుకూడ నా వెంటనే యుండెను.

అచ్చట కొంతదూరములో యెత్తైన చెట్టుకనబడెను. ఆ చెట్టుదగ్గరకుపోయి మా ప్రాణరక్షణకై ఆ రాత్రిగడుపుటకై ఆ చెట్టుపైకెక్కి కూర్చుంటిమి మిగులభయముతో నక్కికూర్చుంటిమి. కొంతసేపైనతరువాత ఆ భయంకరసర్పమే పెద్దచప్పుడు చేసుకొనుచు, ఆ చెట్టుమొదటకువచ్చి నిలచెను. మానుపైనుండి యెక్కి నాకంటె కొంచెము క్రిందుగా కూర్చుండియున్న నా స్నేహితునిపట్టుకొని నొక్కినొక్కి నలిపి మ్రింగివేసి వెంటనే పాము వెళ్ళిపోయెను. నేను మహాభయ

ముతో తెల్లవారువరకు చెట్టుపైనెక్కి అట్లేకూర్చుంటిని. నేను బ్రతికియున్న వానివలెలేను నిజముగా చచ్చినవానివలెనే యుంటిని. నా యిద్దరి స్నేహితుల దుర్మరణముచూచి నాకపరిమితమైన భయముకలిగినది. "నాకుకూడ అట్టిదుర్మరణమే, ప్రాణభయమే రానున్నదని తలచి" మిక్కిలి భీతినొందితిని. "సముద్రములో దూకి ప్రాణములు విడువవలెనని" తలచితిని. కాని యీ ప్రకృతి యింకను జీవితాశను కలిగించెను. నేను దైవమునే నమ్మికొని యుంటిని. "దైవముతలచిన యెవ్వరుచంపగలరు? యెవ్వరు జీవింపచేయగలరు? ఎవ్వరు జీవింపగలరు? మనము శక్తియున్నంతవరకు జీవించుటకై సర్వప్రయత్నములు చేయవలెను." అని తలచితిని.

అంత నేను చాలముండ్లపొదలు చిన్నకొయ్యముక్కలు, పెద్దపెద్ద ముండ్లకంపలు పోగుచేసితిని. పెద్దకట్టగా కట్టి చెట్టునకు చుట్టి గుండ్రముగా పొదవలె అమర్చితిని. చెట్లకొమ్మలకు కూడ సందులేకుండా ముళ్లకంచెలుకట్టి, ఆ మాటుచాటున కూర్చుంటిని. కాని ఆ పెద్ద క్రూరసర్పము వచ్చి, మ్రింగునను భయముమాత్రము పోలేదు. "దైవవిధిని యెవ్వడు తప్పించుకొనలేడని నమ్మి" అట్లే కూర్చుంటిని. రాత్రి యథాప్రకారముగా పెద్దపాము చెట్టుసమీపమునకువచ్చి చెట్టుచుట్టు తిరిగిచూచినది. పైకెక్కుటకు అసాధ్యముగా నుండుటచే నేనేర్పరిచిన ముండ్లప్రాకారమును దాటి, నాదగ్గరకు సులువుగా రాలేకపోయినది. ఎలుకకై పిల్లికాచియుండునట్లు నన్ను మ్రింగుటకై తరుణము చూచుచు చెట్టుక్రిందేపాము

ఉదయమువరకు పొంచియుండెను. కాని నేనుదానికి యెరగా దొరకలేదు. బాగా వెలుగురాగానే పాము చెట్టుపిడిచి వెళ్ళిపోయెను. నేను రాత్రంతయు నిద్రలేకను పాముపెట్టిన భయమువల్లను, దాని విషగాలివల్లను, సొమ్మసిల్లిపోయితిని. ఇట్టి ఆపద ననుభవించుటకంటె మరణమే మేలని తలచితిని. గండము గడిచినందుకు దేవుని స్మరించుకొనుచు సముద్రము వైపునకు పరుగిడితిని. నేనుకష్టములు పడలేక సముద్రములో పడవలెనని తలచునంతలో అదృష్టవశమున దూరముగా సముద్రములో ఒకఓడ కనబడెను—దేవుడు నాపై కరుణకలిగి నన్నురక్షించుటకై ఆ పడవను నాకు కనబరచెను. "ఆహా! పరమేశ్వరా! కరుణాకరా! దీనరక్షకా! నీవేగదా ఆపదలు తొలగించి రక్షించువాడవు" అని తలచితిని.

ఆ పడవనుచూచి సంతోషముతో నా శక్తి కొలది గట్టిగా కేకలుపెట్టితిని. నాతలపాగ గుడ్డతీసి ఓడలోనివారికి కనబడులాగున యెగురవేసి చూపితిని. నా అదృష్టమువలన, దైవకృపవలన, నావలోనివారు నన్ను చూచిరి. దయావంతుడగు ఒడయజమాని నారక్షణకై ఒక చిన్న పడవను పంపెను. నేను వెంటనే చిన్నపడవలోయెక్కి ఓడలోనికి చేరితిని. నన్ను ఆ ఓడలోని వారందరు చూచినతోడనే ఆశ్చర్యముతో నాచుట్టు మూగిపోయిరి. నేనెట్లు ఆ దీవిలోనికి వచ్చినది చెప్పుమని యడిగిరి. నేనువారికి నాకుసంభవించిన సర్వవిషయములును చెప్పితిని. నాసాహస చరిత్రనువిని వారుమిక్కిలి ఆశ్చర్యపడిరి. అన్ని ఆపదలుదాటి జీవించియున్నందుకు

దేవుని వేనోళ్ళపొగడిరి. వారిలో ముసలివాడొకడు ఆ దీవి లోని రాక్షసులను గూర్చి, పెద్దపెద్దసర్పములను గూర్చి తానిదివరలో వినియుంటినని ఓడలోని వారికివర్ణించి చెప్పెను.

అంతటవారు నాపై జాలిపడి నాకుమంచి ఆహారము పెట్టిరి. నాదుస్తులన్నియు మిక్కిలి చినిగిపోయి పీలికలుగా నున్నవి. అందుచే ఓడకెప్టెను నాయందు దయగలిగి, మంచి దుస్తులుయిచ్చెను. నేనాఓడలో చాలరోజులు ప్రయాణము చేసి బాలద్వీపములు చేరితిని. తుదకు సలబాకుద్వీపము చేరితిని. అచ్చట రక్తచందనపు చెట్లుచాలగలవు. ఆ ద్వీపము చెంతనే ఓడ లంగరువేసి ఆపితిమి. ఓడలోని వర్తకులు సరుకులుదింపి అచటివారికి అమ్మిరి. కొంత క్రొత్తసరుకును మార్చుకొనిరి. నేను మాత్రమొకచోట విచారముతో కూర్చుంటిని.

ఇంతలో ఓడయజమాని నాదగ్గరకువచ్చి "అన్నా! నా అధీనములో కొంత సరుకువున్నది. అది యొకవర్తకునిది. ఆ వర్తకుడు మాతో వచ్చి, ఒకదీవిలో ఓడకు నీరుపెట్టుటకై ఆగినప్పుడు దిగి ప్రమాదమున ఒకచోట ఆగిపోయెను. అతడీ పాటికి మరణించియే యుండును. ఆ సరుకును అమ్మి ఆ సొమ్మును వానిబంధువులకు యివ్వదలచితిని. ఇదిగో సరుకు. నీవుదానిని అమ్మి కొంతలాభము తీసుకొనుము." అని చెప్పెను. నేను ఓడయజమానికి కృతజ్ఞతతో నమస్కరించితిని. "ఆ సరుకు పేళ్ళను యెవరిపేరున జమకట్టను." అని గుమస్తా ఓడకెప్టెనును అడిగెను. అంత ఆతడు ఆసరుకులు

"సిందుబాదు" పేర జమ కట్టుకొనుము." అని చెప్పెను. ఆ మాటలు సిందుబాదునని విని చాలఆశ్చర్యపడితిని. ఆ సరుకుల యజమానిపేరు లెక్కలపుస్తకములో సిందుబాదు అని వుండుటకూడ చూచి మిక్కిలి ఆనందించితిని నేను ఓడయజమానితో "అన్నా ! నేనే సిందుబాదును. నీవు మరణించితినని తలచితివి. కాని నేను దైవకృపచే ఆపదలన్నియు అనుభవించి తుదకిట్లు జీవించివచ్చితిని." అని చెప్పితిని.

ఆ ఓడ నాయకుడు నన్ను చాలపరీక్షించి తుదకు సిందుబాదునే అనినమ్మి నాకుసరుకును అప్పగించెను. నేను దేవుని వేనోళ్ల పొగడితిని. ఆ దీవిని విడిచి యింకొకద్వీపమునకు ప్రయాణము సాగించితిమి. అచ్చట నా సరుకును అమ్మి యేలకులు లవంగాలు, మున్నగు పరిమళద్రవ్యములు తీసుకొని యితరదీవులలో అమ్మి చాలధనము గడించితిని. ఒకద్వీపములో విపరీతమైన పొడుగు యెత్తుగల తాబేలును చూచితిని. ఆవువలె పాలిచ్చు చేపనుచూచితిని. దానిచర్మముతో యుద్ధములో పనికివచ్చు డాలుతయారుచేయుదురు. కొన్నిచోట్లలందు ఒంటెఆకారముగల పెద్దచేపలను చూచితిని. తుదకు ప్రయాణముచేసి ద్వీపములుదాటి బాల్సొరా చేరితిని. అచటి నుండి బాగ్దాదుపట్టణము చేరితిని. అపరిమిత ధనరాసులను చేర్చితిని. ఆ ధనముతో పెద్దభూవసతిని కొంటిని. ఇది నా మూడవ సాహసప్రయాణము అని చెప్పి సిందుబాదు హిందుబాదునకు మరి నూరురూపాయిలు బట్టలుయివ్వగా

ఆతడు మిక్కిలి ఆనందించెను. మరునాడు హిందుబాదు విందునకురాగా నాల్గవప్రయాణమును గూర్చి చెప్పదొడగెను.

## 4 వ ప్రయాణము

అన్నా! నాకు దొరికినధనము ఆనందముకూడ ప్రయాణములో కలిగిన ఆపదలు కష్టములను మరచిపోవునట్లు చేసెను. నా మనస్సు ప్రయాణమునకే మిక్కిలి కోరుచుండెను. దేశములోగల క్రొత్తవింతలను చూడవలెనని మరల వర్తకము చేయవలెనని ఆశ - అమితోత్సాహము కలిగెను. ఆదుర్దా యెక్కువయ్యెను. ప్రయాణమువైపునకే బుద్ధిలాగుకొని పోయినది. అందుచే మంచివర్తకులతో కూడి సరుకులను పోగుచేసుకొని, ప్రయాణమునకు సిద్ధపడితిని. ఒకమంచి ఓడపై సరుకులు వేయించుకొని, పరిషియా దేశమువైపునకు చాల రాజ్యములుదాటి ప్రయాణమై పోవుచుంటిని. మార్గములో మాకు చాలరేవు పట్టణములు కనబడెను మాకు తూర్పుగా చాలదీవులు కనబడెను. సముద్రములో ప్రయాణమై పోవునపుడు ఒకరోజున హఠాత్తుగా గొప్పగాలి వేగముతో వీచినది. ఓడలోని ప్రయాణీకులు, వర్తకులు, కెప్టెనుకూడ చాల ఆందోళన, భయము, పొందితిమి.

ఓడనాయకుడు తెరచాపలను దింపివేసి, ఓడ రక్షణకై సర్వవిధముల జాగ్రత్తపడుచుండెను. కాని ఆ తీవ్రమైనగాలిలో

అన్నిప్రయత్నములు కూడ నిష్ఫలములయ్యెను. తెరచాప వెయ్యిముక్కలుగాఅయ్యెను. ఓడ ఒక్కసారిగా తొణుకులాడి ఒకప్రక్కగా వరిగిపోయెను. అందుచే చాల వర్తకసరుకును, వర్తకులును కూడ సముద్రములో పడి మునిగిపోయిరి అదృష్ట వశముచే నేను కొందరువర్తకులు, నావికులు మాత్రము బ్రతికి బయటపడితిమి. అచట మేమొక కొయ్యపలకను పట్టు కొనునంతలో మేమొక మహాప్రవాహములో బడి యొక దీవిలోనికి కొట్టుకొనిపోయితిమి ఆ ద్వీపములోగల పండ్లు, మంచినీరు, మాకు ప్రాణములు నిలబెట్టినవి. ఆ రాత్రంతయు సముద్రతీరముననే యుండిపోతిమి. మాకేమి చేయుటకును తోచక కొట్టుకొనుచుంటిమి. ద్వీపములోనికి పోవుటకు ధైర్య సాహసములు లేకుండ పోయినవి. మాకెట్టిఆపదలు రానున్నవో అని దిగులుపడితిమి.

తెల్లవారినపిమ్మట సముద్రతీరము విడచి ద్వీపము లోనికి పోయి చూచితిమి. దూరమున కొలదిగా యిండ్లు కనబడెను. ఆయిళ్లు సమీపమునకు వెళ్లగానే అచ్చటివారు మమ్ములను చుట్టుముట్టిరి. వారందరు నల్లనిరంగు శరీరముగల నీగ్రోలే! మమ్ముపట్టుకొని వారిండ్లకు లాగుకొనిపోయిరి. నన్నుమరొక ఐనుగురు స్నేహితులను ఒకచోటికి లాగుకొని పోయి కూర్చుండబెట్టిరి. ఏదో ఒకరకమైన మూలికనుయిచ్చి తినుడని సంజ్ఞచేసిరి నాస్నేహితులు మిక్కిలి ఆకలిగానుండు టచే దురాశతో దానిని తినుచుండిరి. నేను మాత్రము యిందేదో మోసముండునని యూహించితిని. ఆ మూలికను

కొంచెము రుచిచూచి పారవేసితిని. కొద్దిసేపటిలో నాస్నేహి తులు బుద్ధినశించినవారుగా మారిపోయిరి. పిచ్చిగా వారేమి మాట్లాడుచుండిరో తెలియకుండ మాట్లాడసాగిరి. ఆనీగ్రోలు కొబ్బరికూనితో తయారుచేసిన అన్నము, పిడివంటలు, మాకు తెచ్చిపెట్టిరి. నాస్నేహితులు పిచ్చివారు అందుచే, ఆహారమును దురాశతో మెక్కువగా మెక్కసాగిరి

నేను మాత్రము కొంచెముతిని యూరకుంటిని. మొద టిచ్చిన మూలికనే మగలమాచే తినిపించసాగిరి. నేనుమాత్ర మతిజాగ్రత్తతో మెలగుచుంటిని. మాకు మంచిఆహారముపెట్టి బలము, కొవ్వు, కండ, కలుగవలెనని అల్లుపెంచుచుండిరి. నరమాంసమును తినే ఆనీగ్రోవారు మేము చక్కగా బలి యుటతోడనే, చంపితినవచ్చునని యూహించిరి. అట్లే నీగ్రోలు నా స్నేహితులను కండపుష్టికలవారిని చంపితినివేసిరి. నేనుమాత్రము దినదినమును సీరసించితిని. పుల్లవలె అయి పోవుటచే మరొకప్పుడు చంపి తినవచ్చునని విడిచిపెట్టిరి. నాజోలికి రాక నన్ను చూడకుండపోయిరి. అందుచే నాకు తగినంతవిశ్రాంతి స్వేచ్ఛకలిగినది. నేనేమిచేసినను నన్ను చూచువారే లేకుండిరి.

అందుచే వారిండ్లనుండి చాలవరకుపోయి అచ్చటి నుండి పారిపోవుటకు తగినఅవకాశము దొరికినది. నన్ను పట్టు కొనుటకెవ్వరును లేరు. ఒకముసలివాడు మాత్రముండెను. ఆతడు నన్ను గట్టిగా కేకపెట్టిపిలిచెను. ఆతని కేకలను నేను లెక్కచేయక వేగముగా పరుగెత్తిపోయితిని. ఆతని దృష్టికి

కనబడనంత దూరమువరకు పోతిని. నేను రాత్రివరకు చాల దూరము నడిచిపోయితిని. ఒకచోట విశ్రాంతికై ఆగి, కొంచెము ఆహారముతిని మరల ప్రయాణము సాగించితిని. ఇట్లు యేడు దినములవరకు కాలినడకను ప్రయాణముచేసి ఒకచోటునకూ వచ్చిచేరితిని. అచ్చటివారుకూడ కొబ్బరికాయలనే ఆహారముగా వాడుదురు. ఆ చుట్టుపట్ల దీవులలోని వారందరును నీగ్రోలే! వారిని తప్పించుకొని యెనిమిదవరోజున తెల్లవారు నివశించేచోటునకు వెళ్ళిచేరితిని.

వారు మిరియాలు పోగుచేయుచుండిరి. వారివలన భయములేదని తలచి అచ్చటకుపోయి ఆగితిని. వారు నన్ను చూడగనే నాచుట్టుమూగి నేనెవ్వరినో నేనెక్కడినుండి వచ్చుచుంటినో అంతయు చెప్పమని అడిగిరి. నేను వారి మాటలువిని మిక్కిలి ఆనందించి నా పడవప్రయాణము, పడవ మునిగిపోవుట, నీగ్రోల చేతులోచిక్కుకొనుట, వారు నా స్నేహితులను చంపుట, నేను తప్పించుకొనిరాగల్గుట, మున్నగు నాచరిత్రచెప్పితిని. "ఆహా! నీవు దైవయోగమున వారిచే చంపబడకుండ బ్రతకగల్గితివి." అని వారు మిక్కిలి సంతోషించిరి. నేనువారితో కలిసి వారిద్వీపమునకు వెళ్ళితిని. వారు నన్నుతీసికొనిపోయి వారిరాజునకు సమర్పించిరి.

ఆ రాజు మంచిదయ కరుణకలవాడు. నా సాహస చరిత్రను, నాకుకలిగిన ఆపదలనువిని జాలిపొందెను. నాకు అన్నము బట్టలు యిచ్చి దయతో ఆదరించెను. నన్ను జాగ్రత్తగా కాపాడమని ఆతని వుద్యోగస్తులకు వుత్తరువు

చేసెను. ఆ ద్వీపమునిండ సర్వసంపదలుకలవు. అందు విస్తారము జనులు నివశించుచుండిరి. ఆ నగరమే ముఖ్యపట్టణము. మంచివర్తకస్థానము - నేనీద్వీపములో ఆగుటవలన, అమిత సంతోషము కలిగినది. నాకిదివరలో దురదృష్టవశముచే కలిగిన ఆపదలన్నియు తొలగిపోయినవి. సర్వసౌఖ్యములతో తృప్తిగా ఆనందముగానున్నది. రాజు నాయందు దయగా వుండుటచే తృప్తికలిగి మిక్కిలిహాయిగానున్నది. ఆతడు నాయందు చూపుచున్న అనుగ్రహము అందరిపై కంటెను యెక్కువైనది. పట్టణములో ప్రతివారును నాకు విధేయులై స్నేహితులై యుండిరి. అంతయెందుకు ఒక్కమాటలో చెప్పెదను. నన్ను పరాయివానిగా చూడలేదు. నన్ను వారిదేశపు వానినిగనే చూచిరి అట్టి గౌరవమర్యాదలనే చూపించి ఆదరించసాగిరి.

అచ్చట నేనొక ఆశ్చర్యకరమైన అసాధారణమైన వింతను కనుగొంటిని. ఆ నగరములోని ప్రజలు రాజు కూడ గుఱ్ఱమునకు కళ్లెముకాని, జీనుకాని, రికాబులుకాని లేకుండగానే స్వారిచేయుదురు. దీనినిచూచి నేను రాజుతో "ఈ అలవాటు యెట్లు మీకువచ్చినది ?" అని అంటిని. ఆ రాజు "నీవు చెప్పిన వస్తువులేమో వాటివుపయోగమేమో యీ దేశములోని ప్రజలకుగాని నాకుగాని తెలియదు. వాటి నెప్పుడు చూచియుండలేదు" అనెను. అంత నేనొక పనివానిదగ్గరకుపోయి గుఱ్రపుజీను, కళ్లెము, రికాబులు, నమోనా యిచ్చి తయారుచేయించితిని. అవి తయారుకాగానే తీసు

కొంటిని. జీనునకు ముఖములు పట్టుతో కుట్టిన తోలుఅమర్చి బంగారుపువ్వులతో అలంకరించితిని. ఈ మూడువస్తువులను రాజునకు బహూకరించితిని. మంచిబలమైన పంచకల్యాణి గుర్రమునకు జీను, కళ్ళెము, రికాబులు తొడిగెను. రాజు ఆ గుర్రముపై స్వారిచేసెను. రాజు అపరిమితానందమును పొంది నాకు లెక్కలేనంత ధనము బహుమతీగా యిచ్చెను. మంత్రులు, పెద్దఆఫీసర్లు, దేశములోని ధనికులు, యితర ప్రజలు, నాకు విలువలేనంత ధనము బహుమతీ చేసిరి. నేను మిగుల గొప్పధనికుడనైతిని. ఇంతేగాక ప్రజలు పెద్దసంఘములుగా వచ్చి నన్ను మిక్కిలి కొనియాడి గౌరవించిరి. వారందరును కూడ యీ పనిముట్లు తయారుచేయించుకొనిరి. ఉపయోగించి ఆనందించసాగిరి. నేను రాజదర్బారునకు తరుచుపోయి రాజుతో ఖులాసాగా స్వేచ్ఛగా మాట్లాడుచుండే వాడను. ఇట్లు కొంతకాలము సుఖముగాజరిగెను.

ఒకరోజునరాజు “ సిందుబాదు ! నీయందు నాకమిత మైన ప్రేమ, దయ కలదు. నాప్రజలందరు నిన్ను భక్తితో చూచుచున్నారు. ఈ దేశము, యీ రాజ్యము, పరాయి వానిదిగా భావించకుము. నీ స్వంతముగానే తలంచుము. నామనస్సులో ఒకతలంపుకలదు. దానిని నీవు తప్పక నెర వేర్చవలెను. నీవు మా దేశములోని సుందరిని పెండ్లాడి సుఖించవలెను ” అని చెప్పెను.

ఆరాజు చెప్పిన మాటలువిని “ రాజా ! నేను మీయధీనము నందున్నాను. నేను మీకెప్పుడును విధేయుడనే !

మీ మాటకు నే నెదురాడగలనా ?" అని చెప్పితిని. ఆరాజు కోరికను అంగీకరించుటతప్ప, మరేమియు వ్యతిరేకముగా చెప్ప లేకపోయితిని. మరునాడు రాజదర్బారులోనిధనికురాలు మంచి సౌందర్యవంతురాలునగు ఒకకన్యకను నాకిచ్చి వైభవముగా పెండ్లిచేసిరి. ఆ సుందరితో నేనొక దివ్యభవనములో చాల కాలము సౌఖ్యము అనుభవించితిని. కాని నాకు ఆ దేశములో స్థిరనివాసముగా నుండుట యిష్టము లేకపోవుటచే కష్టముగా నుండెను. మాయోపాయముచే యెట్లో తప్పించుకొని నానగర మగు బాగ్దాదునకు పారిపోవ తలచుచుంటిని.

ఇట్లుండగా నాపొరుగింటి స్నేహితునిభార్య జబ్బుచేసి చనిపోయెను. నేను ఆతనిని ఓదార్చుటకై వెళ్ళిచూచితిని. నా స్నేహితుడు దుఃఖసముద్రములో మునిగిపోయి పిచ్చివాని వలె నుండెను. నేను వానితో "దేవుడు నీకష్టముతీర్చును. నీవు దుఃఖింపకుము. కష్టములు ప్రతివారికిని తప్పవు. నీవు సుఖముగా చాలకాలము జీవించెదవు. ఆపదలోనున్నప్పుడే ధైర్యముగా నుండవలెను." అని అంటిని. ఆతడు "అన్నా! నాకంత అదృష్టమున్నదా ? చిరకాలము జీవింతునా ? ఒక గంటలో నేను మరణింపనున్నాను ! నాజీవితము ముగిసిపోయి నది ! ఈ రోజున మరణించిన నాభార్యతో నన్నుకూడ గోరిలో పూడ్చివేసెదరు. ఈ దేశములో పూర్వులు యేర్పరి చిన దేశాచారము. దీనిని ప్రతీవారును తప్పక ఆచరించ వలెను. భార్యచనిపోయిన భర్తను, భర్తచనిపోయిన భార్యను, కలిపి భూమిలో పాతిపెట్టెదరు. నన్నెవ్వరును బ్రతికించి

కాపాడలేరు. అట్లుచేయుట న్యాయవిరుద్ధము. ఈ ధర్మమును అందరు పాటించవలసినదే!" అని చెప్పెను. ఘోరమైన యీదురలవాటును గూర్చివిని నేను మిక్కిలి కలవరపాటు నొంది భయపడితిని.

అంతలో ఆతని బంధువులు చాలమంది అచ్చటికి వచ్చిరి. వారు చనిపోయిన స్త్రీకి మంచిబట్టలుకట్టి నగలుఅలంకరించి ఒక పెట్టిలో పెట్టిరి. పెద్దపెండ్లివూరేగింపువలె, మేళతాళములతో బయలుదేరి స్మశానభూమికి పోయిరి. నాస్నేహితుడైన ఆమెభర్త ఆ గుంపునకు ముందునడచుచు, పోవుచుండెను. వారందరు అట్లుపోయిపోయి ఒకపర్వతము పైకివెళ్ళిరి. అక్కడ ఒకపెద్దరాతిబండను తీయగా మహాలోతైన ఒకవెడల్పైన గొయ్యికనబడెను. నగలు బట్టలతో కూడ ఆ శవపేటికను ఆ గోతిలో పెట్టివేసి పూడ్చిరి. ఆమె భర్త బంధుమిత్రులను కడసారిగా కౌగలించుకొని మిక్కిలి యేడ్చెను. ఆతనినికూడ యింకొకపెట్టిలో పెట్టి నీటితో ఒక కూజ యేడురొట్టెలు అందులోవుంచి గోతిలో పాతిపెట్టివేసిరి. మరల ఆ పెద్దరాతిబండతో గోతినిమూసివేసి నిర్విచారముగా బయలుదేరిరి. అంతటితో ఆపని ముగిసెను. ఆ పర్వతము చాలపొడవుగా సముద్రతీరమువరకును కలదు. అచ్చటికి వచ్చినవారిలో నేనుతక్క మరెవ్వరును ఆతనికై విచారించలేదు. అది ఆ దేశాచారమగుటచే వారికి దానిలో అంతగా విచారించవలసిన అవుసరము లేకపోయినది. వారు దానికి చాలకాలమునుండి అలవాటుపడిరి. కాని విదేశీయుడ

నగు నాకుమాత్రము దానినిగూర్చి చాలబాధగానున్నది. నేను సహించి వూరకుండలేకపోయితిని.

ఒకనాడు రాజదర్బారునకు పోయి, "రాజా ? ఈదేశములో నెంతక్రూరమైన దురాచారము బలిసిపోయినది ! చనిపోయిన వానితో బ్రతికియున్న వానిని కూడకలిపి భూమిలో పూడ్చిపెట్టుట యెంతఘోరమైనపని ! ఎన్నోదేశములు తిరిగి చూచితిని, కాని యిట్టి నీచమైన క్రూరమైన దురాచారమును యెచ్చటను చూడలేదు" అని అంటిని. రాజు నాతో "సిందుబాదు ! నీ అభిప్రాయమేమి ? ఇది సర్వసాధారణమైన ఆచారమే ? ఇందులో ఆశ్చర్యపడ వలసినదేమియు లేదు. ఒకవేళ రాణియగు నాభార్యయే ముందు చనిపోయినచో తప్పక నేనుకూడ ఆమెతో మరణించవలసినదే ? ఎవ్వరికిని దీనిని తప్పించవీలులేదు." అని చెప్పెను.

నేను కొంచెము భయముతో "రాజా ! విదేశీయులు కూడ యీ ఆచారమును పాటించవలెనా ? అయ్యో యెంత కష్టము." అని నిట్టూర్చిఅడిగితిని. నామాటలువిని రాజు "ఓ స్నేహితుడా ! అందులో సందేహములేదు. ఎవ్వరైనను సరే యీదేశములో పెండ్లాడినవారందరు యీ ఆచారమును ఆచరించవలసినదే ! ఇందెవ్వరికిని మినహాయింపులేదు." అని నవ్వుచు నాతోచెప్పెను. నేనుదీనినే తలచుకొనుచు, మిక్కిలి దుఃఖముతో యింటికి పోయితిని. "నేనుకూడ యిట్లే ఘోరముగా మరణింపవలసివచ్చునా ? ఇందుకు వేరే ఉపాయము లేదా ? తప్పించుకొనుమార్గములేదా ? భగవంతుని అనుగ్రహ

మెట్లుండునో? నాకు ఆపదలు యింకను విడవలేదా? దుర్దశ సంభవించినప్పుడు యెచ్చటికి పోయినను కష్టములు రాక తప్పవుకదా?" అని అనుకొంటిని.

నేను తలచినట్లుగనే అయ్యో. అయ్యో! నాభార్యకు రోగము వచ్చినది. స్వల్పకాలములో రోగము ముదిరి తుదకు చనిపోయినది. నాకువళ్లు కంపించినది. భయమెక్కువైనది. గుండెవేగముగా కొట్టుకొనసాగెను. నా విచారమునకు అంతు లేదు. బ్రతికియుండగనే బలవంతముగా భూమిలో పూడ్చిపెట్ట బడుటా? అయ్యో! ఎంతఘోరము? ఇదివరలోనే నేను రాక్షసులచే మ్రింగబడియున్నచో బాగుండునే! అయ్యో! ఎంతకష్టము సంభవించినది! ఓ దైవమా! ఈ కష్టము ననుభ వింప జేయుటకేనా? అప్పుడట్లు కాపాడి యిక్కడికి చేర్చితివి!" అని అనేకవిధములుగా తలచుకొనుచు, మిక్కిలి ఆవేదనతో దుఃఖించుచుంటిని? ఇంతలో నాభార్య చనిపోయినట్లు పట్టణ ములో అందరికిని తెలిసిపోయినది. రాజుదర్బారులోని అధి కారులు, నాముఖ్యస్నేహితులు, పెద్దధనికులు అందరు నాయింటికివచ్చిరి. నన్ను ఓదార్చిరి. గొప్ప రాజవైభవముగా అంతయు తయారుచేయబడెను. బంగారునగలు, అపరిమితమైన ధనము, పట్టుబట్టలతో నాభార్యను పెట్టిలోపెట్టిరి. మేళ తాళములతో పోవుచున్న ఆవూరేగింపుతో జనులు గుంపులు గుంపులుగా వచ్చుచుండిరి. కొందరు గుర్రములపై యెక్కి వచ్చుచుండిరి. నేను మరణించవలెనుగదా! అను మహా

దుఃఖములో మునిగి నాదురవస్తను నిందించుకొనుచు ముందు నడచిపోవుచుంటిని.

అంత మేమందరమును స్మశానముగా వాడుకొను చున్న పర్వతసమీపముగా వచ్చిచేరతిమి. నాకు వళ్లుకంప మెత్తినవి. కాళ్లు దడదడలాడినవి. అంత నేను రాజునకు నాచుట్టుమూగిన అధికారులకు వంగినమస్కారములు చేసితిని. వారిపాదములు పట్టుకొని జాలిగా వారిమనసుకరుగునట్లు "అన్నలారా! నేను పరదేశవాసుడను ఈ దేశస్తుడనుకాను. నా దేశములో నాకుయిల్లు భార్య, పిల్లలు వున్నారు. ఈ ఘోరమగు మీమతకట్టుబాటు నాకువర్తించదు. ఈ కఠిన శాసనము నాపై అమలుచేయుట అన్యాయము. నన్ను క్రూరముగ చచ్చేటట్లు భూమిలో కప్పివేయకండి" అని గట్టిగా యేడ్చుచు మొరపెట్టితిని. కాని అచ్చటివారి మనసు కరగలేదు. రాతిహృదయులు నా మొరను వినిపించుకొనలేదు. వారు అతిత్వరగా ఆ శవపేటికను గోతులోపెట్టిరి. వెంటనే నన్నుకూడ యింకొక పెట్టిలో పెట్టి నీళ్ళకూజా యేడురొట్టెలు పెట్టి, అందులో విడిచిపెట్టిరి. పైనద్వారమునకు రాతిబండను మూసివేసి, నిర్విచారముగా వెళ్ళిపోయిరి. నాదుఃఖము నాయేడ్పుతో వేసిన కేకలు వారువినిపించుకొనకుండానే నన్నా గుహలో త్రోసివేసిరి. మతధర్మములు యెంతక్రూరముగా నున్నవో! నిండుప్రాణముగల మనిషిని బలవంతముగా చంపుటా!

నేను మహాదుఃఖములో మునిగిపోతిని. కాదు-చీకటిగా నున్న ఆ పర్వతగుహలో క్రిందకుపోయితిని. నేను గుహలో తిరుగుచుండగా ఒకకన్నముగుండా కొంచెము వెలుతురు కనబడెను. ఆ భూగర్భములోని గుహ యోజనములలోతు మిక్కిలి విశాలము చాలపొడవుగా నున్నది. చాలదుర్వాసనతో కూడియున్నది. నాముక్కు మూసుకొని విపరీతముగా దుఃఖించుచు నెమ్మదిగా తడుముకొనుచు నడుచుచుంటిని. నాచుట్టు చాలశవములపెట్టెలు వున్నట్లు కాళ్లకుతగిలినవి. నేను విచారముతో "ఓదైవమా! నీలీలలు తెలియరానివి? నేనిట్టి ఆపదపొందుదునని తలచలేదు. నన్ను చాలసార్లు ఆపదలు తప్పించి మరణించకుండా కాపాడితివే? ఇప్పుడిక్కడ యిట్లు కఠినముగా చంపుటకేనా? అయ్యో! నాకేదిశరణ్యము? ఈ విపత్తు దాటుమార్గము చూపవా? నేను దురాశతో యేల యిట్టి పరదేశములకు వచ్చిచేరితిని? నా ధనముతో సంతృప్తిపడి యింటిలో వుండలేకపోతినే? అయ్యో! నేను చచ్చుట తప్పదా?" అని అనుకొంటిని. సమాధిలో వుంచ్చి వేయబడిన నాకింకను జీవించగలననే ఆశపోలేదు. నాఆహారము తిని రోజులుగడుపుచుంటిని. నావిచారముతో జుట్టుపీకుకొని కడుపుబాదుకొని గట్టిగా కేకలుపెట్టి యేడ్చితిని. కాని యేమి లాభము? నాదంతయు అరణ్యరోదనమయ్యెను. ఆ చీకటి గుహనిండ లెక్కలేనన్ని పెట్టెలు శవలతో వున్నవి. అచ్చటి శవపేటికలలోని రొట్టెనీరు తీసుకొని జీవించుచుంటిని.

ఒకరోజున ఆ చీకటిగుహలో యేదోజంతువ వడచినట్లు చప్పుడయ్యెను. నేనాధ్వనితో కూడ వెదకుచుపోయితిని. ఆ జంతువ యెగురుచు, దుముకుచు, పరుగెత్తుచు, దూరముగా పోయెను. ఒకచోట తెల్లగ నక్షత్రమువలె వెలుగుకనబడెను. దగ్గరకుపోయి చూడగా ఒకపెద్దకన్నములోనుండి వెలుగు వచ్చుచున్నట్లు కనబడినది. ఆ కన్నము మనిషి దూరిపోవుటకు తగినంత పెద్దదిగానున్నది. నాకు చాల నీరసముగా నుండుటచే కొంతసేపటివరకు అచ్చటే పడియుంటిని. తరువాత నేనులేచి ఆ కన్నముగుండా పైకివచ్చితిని. చూడగా సముద్రతీరమై యుండెను. నేను అదిచూచి అపరిమితానందమును పొందితిని. “ఇదికలా! నిజమా!” అని సందేహపడితిని. దేవుని వేయి నోళ్ళ కొనియాడితిని. “ఆహా! యిక జీవించవచ్చునుకదా!” అని ధైర్యపడితిని.

ఇట్టి ఆనందముతో నుండగా గుహలోపలినుండి ఆ కన్నముద్వారా ఒక సముద్రజంతువవచ్చి నీటిలో మునిగి పోయెను. అదితరుచు ఆ చీకటిగుహలోదూరి అందుండు శవములనుతిని పోవుచుండునని గ్రహించితిని. ఆ పర్వతము సముద్రమునకును, ఆ పట్టణమునకును మధ్యగానుండెను. సముద్రతీరముగా నున్న పర్వతభాగము చాల యెగుడుదిగుడు గాను, లోతుగాను వుండెను. దేవునిప్రార్థించి మరల కన్నము నుండి చీకటిగుహలోదూరి ఆహారము తీసుకొంటిని. నాలుగైదు రోజులు విశ్రాంతిగా గడిపితిని. ఒకరోజున ధైర్యమువహించి చీకటిగుహలో వెదకుచు, తడుముకొనుచు, శవపేటికలలోని

రత్నములు, వజ్రములు, కెంపులు, బంగారునగలు, ధనము, పట్టుబట్టలు మోయగలిగినన్ని సముద్రపువడ్డునకు చేర్చితిని. లెక్కలేనంత సరుకు పోగుచేసి మంచిఅందముగా బేళ్ళుగా తయారుచేసి తాళ్ళతో బిగించికట్టితిని. ఆ సముద్రతీరముననే మూడునాలుగురోజులు ఓడయేదైన వచ్చునేమోనని ఆగి పోతిని.

మరునాడు దేవునిదయచే ఒకపెద్దనావ హార్బరుదాటి నా వైపుగా ప్రయాణముచేసి వచ్చుచున్నట్లు చూచితిని. నాతలపాగా గుడ్డనువిప్పి యెగరవేసి ఓడలోనివారికి గుర్తుగా చూపితిని. ఓపికయున్నంత మట్టుకు గట్టిగా కేకలుపెట్టి అరచి తిని. వారునా కేకలు వినిరి. ఓడయజమాని నారక్షణకై ఒక చిన్న తెప్పను పంపెను. నేను నా సామానంతయు దానిలో యెక్కించి ఓడచేర్చితిని. నేను క్షేమముగా ఓడలో యెక్కి కూర్చుంటిని. నన్నుచూచి ఓడలోనివారు, కెప్టెనుకూడ ఆ దీవి నేనెట్లు చేరగలిగినది చెప్పుమనికోరిరి. నేను పడవ ప్రమాదములో మునిగి అచ్చటికి చేరితినని నాసాహస కథను చెప్పితిని. ప్రయాణీకులు చాల ఆశ్చర్యపోయిరి. ఓడఅధికారి నాపై చాలజాలిపడి అన్నము, బట్టలు యిచ్చెను. నేను ఆతనికి కొన్నిబంగారునాణెములు యిచ్చితిని. మేమందరము కలిసి ఆ ఓడలో ప్రయాణము చేయుచు చాలద్వీపములు దాటితిమి. పదిరోజులు ప్రయాణముచేసి సెరిండిబుదీవిదాటి బెల్ ద్వీపము చేరితిమి.

తరువాత కేలాద్వీపము చేరితిమి. అచ్చటతగరము, చెరుకు హారతికర్పూరము అమితముగా దొరకును. ఆ ద్వీప నివాసులుకూడ చాల క్రూరులు మనుష్యులనుచంపి తిందురు. వెంటనే మేము ఓడను నడిపి ప్రయాణము సాగించితిమి. మార్గ ములో విశేషధనము సంపాదింపగల్గితిని. కొన్నాళ్ళకు బాగ్దాదు నగరము చేరితిని. నా వెంట అపరిమిత ధనమును తెచ్చితిని. దేవునకు నాపై కరుణకలిగి నందుకు మిక్కిలి ప్రార్థించి బీదలకు విపరీతముగా భోజనములు పెట్టితిని. ధనము పంచిపెట్టితిని. మసీదులు కట్టించితిని. నా బంధుమిత్రులకు సంతోషముతో తృప్తిగా పిండివంటలతో విందుచేసితిని. ఇట్లు సౌఖ్యముగా ఆనందముతో నుంటిని. అని సిందుబాదు చెప్పి మరి నూరు రూపాయిలు క్రొత్తబట్టలు హిందుబాదున కిచ్చెను. ఆతఃడు మిక్కిలి ఆనందించి యింటికి వెడలిపోయెను. మరునాడు మరల ఆతడు సిందుబాదు యింటికి విందునకు వచ్చెను. సిందుబాదు భోజనములైన పిదప ఆతని ఐదవప్రయాణమును గూర్చి చెప్పసాగెను.

## 5 వ ప్రయాణము

అన్నా ! నా సంతోషము ఆనందముకూడ నేపడిన బాధలను ఆపదలను మరుపుచేసినవి. నాలుగుప్రయాణములలో విశేష మైన ధనలాభము కలిగినది. నేను యెన్నికష్టములు పొందినా

తుదకు నాకువిశేషధనము కలిసివచ్చుచుండెను. నాకు ధైర్యముకలిగి మరల వర్తకముచేయుటకై ఆశకలిగెను. కొంత కాలము సుఖభోగములు అనుభవించితిని. ప్రయాణమునకై తయారుపడుటచే క్రొత్తరకపు సరుకులు కొని బేళ్ళుగా తయారుచేయించితిని. నేను చాలధనము ఖర్చుచేసి స్వంతముగా ఒక పెద్దఓడను కట్టించితిని. నాఓడ తయారుకాగానే, మంచి అనుభవము కలవానిని ఓడనాయకునిగా కుదిర్చితిని. చాలమందికూలీలను పెట్టితిని. నాసరుకునంతను ఓడలో కెక్కించితిని. నాతోకూడ యింకాయితర వర్తకులును వారి సరుకులతోను నా ఓడలో తీసుకొనిపోవుటకు యేర్పాటు చేసితిని.

ఒకమంచిరోజున గాలిబాగుగా వీచుచున్నప్పుడు ఓడను విడిచిపెట్టి సముద్రములో ప్రయాణము సాగించితిమి. ఇట్లు చాలదూరము ఓడయాత్ర సాగించిన తరువాత మొదట మాకు యెడారిగానున్న దీవి తగిలినది. అచ్చట జనులెవ్వరును లేరు. అచ్చటే ఓడకు లంగరువేసి ఆపి దీవిలోనికి పోతిమి. ఆ ద్వీపములో పెద్ద గండభేరుండపక్షి గ్రుడ్డు కనబడెను. ఆ గ్రుడ్డుపగిలి పిల్లపైకివచ్చుటకు సిద్ధముగానుండెను. ముక్కుమాత్రము పైకివచ్చి కనబడుచుండెను. నాస్నేహితులగు వర్తకులు నేనువద్దని యెంతగాచెప్పినను వినక, ఆ గ్రుడ్డును బ్రద్దలుకొట్టి అందున్నపిల్లను ముక్కలుకోసి కాల్చితినిరి. వారు ఆహారముతిని ముగించులోపలే ఆకాశముపై చాల దూరమున పెద్దమేఘమువలె ఆడమగపక్షులు యెగురుచు

వచ్చుచుండెను. నేను యేర్పరిచిన మా ఓడకెప్టెను మంచి అనుభవశాలి చాలకష్టములను యెదుర్కొన్నవాడు, అందుచే "అన్నలారా! మీరు వెంటనే ఓడలో యెక్కుడు. లేనిచో చాల అపాయము కలుగును." అని తొందరపెట్టెను. మేమందరము చాలకంగారుతో త్వరగా ఓడయెక్కి సముద్రములో ప్రయాణము సాగించితిమి. శక్తియున్నంతవరకు మాఓడయజమాని ఓడను మహావేగముతో పోనిచ్చుచుండెను. ఇంతలో ఆ భయంకరమగు పెద్దగండభేరుండపక్షులు ఆ దీవిలో గ్రుడ్డుచెంత దిగినవి. వాటిరెక్కలచప్పుడు విని మేము గజగజవణికిపోతిమి. ఆ రెండుపక్షులును వాటిగ్రుడ్డు పగిలిపోయి పిల్లలేకుండుటచూచి మిక్కిలి విచారించినవి. అవి పగపట్టినవి. అవికోపముతో వెంటనేపై కెగిరిపోయి మాకు కనబడకుండ పోయినవి.

మేము బ్రతుకుజీవుడా! అని దేవునిపొగడుకొనుచు ఆపదతొలగినదని సంతోషించితిమి. వేగముగా ఓడను నడుపుకొనుచు సగముదూరమువరకు పోయితిమి. ఇంతలో హఠాత్తుగా ఆ బ్రహ్మాండమైన పెద్దపక్షులు మిక్కిలి బరువైనరాతిబండలను ముక్కునకరచుకొని మా ఓడవైపునకు యెగురుచు వచ్చినవి. అవిమాపై యెగురుచుండగా వాటిరెక్కలధ్వనికి అరుపులకు మాకు చాలభయమువేసినది. ఆకాశమునుండి పిడుగుపడినంత చప్పుడుతో ఆ పక్షులలో ఒకటి మానెత్తిపైకి వచ్చి ఒకరాయిని మా ఓడపై పడవేసినది. ఆరాయిపడగానే మాఓడ మునిగిపోవలసినదే! కాని చుక్కానివాని తెలివివల్ల

ఆ ప్రమాదము తప్పినది. కాని ఆ పెద్దరాయి ఓడప్రక్క నీటిలోపడుటచే పెద్దలోతుగా గొయ్యిపడినది. సముద్రము అడుగుకూడ కనిపించినది. ఆ నీటితోణుకువలన మాఓడక్రిందకు మీదకు చాలసార్లు ఆడిపోయినది. ఇంతలో రెండవపక్షి సరిగా గురిచూచి ఆ పెద్దరాతిబండను మా ఓడలోపడవేసినది. ఇక యేమనిచెప్పను! ఆ రాతిదెబ్బకు మాక్రొత్తఓడ వెయ్యి ముక్కముక్కలై పోయినది. ప్రయాణీకులు, నావికులు, ఓడ పనివారు నీటిలోపడి మునిగిపోయిరి. ఓడలోని సరుకంతయు గంగపాలైనది. రాతిదెబ్బకు కొంతమంది చచ్చిపోయిరి. మిగిలినవారు నీటిలో మునిగిచచ్చిపోయిరి. కాని నేను మాత్రము అదృష్టముచే బ్రతికితిని. నేను నీటిలో కొట్టుకొనుచు యీదుచుండగా ఒకఓడకొయ్యముక్క దొరికినది. దానిసహాయమున ఒకచేతితో యీదుకొనుచు కొంతదూరము పోయితిని. మరల రెండవచేతితో యీదుకొనుచు కెరటములచే కొట్టుకొని పోవుచుంటిని. అన్నపానములులేక చాల నీరసముతో కొనప్రాణములతో ఉంటిని.

తుదకు ప్రవాహములోపడి కొట్టుకొనిపోయి మూడు రోజులకు ద్వీపములో చేరితిని. కాని దానితీరము చాల నిలువుగా నుండెను. మిక్కిలి కష్టముతో ద్వీపముపై కెక్కితిని. అలసటతీరువరకు గడ్డిమైదానములో విశ్రాంతిగా కూర్చుంటిని. ఆయాసముతీరి బలముకలిగిన తరువాత దీవిలోని వింతలు చూడడానికి బయలుదేరినాను. అది చూచుటకు అందమైన పండ్లతోటవలె కాన్పించినది. ఎక్కడచూచినా

పండ్లతో నిండినచెట్లే! ఎక్కడచూచినా మంచినీటి సెల యేరులే! అదిభూలోకములోని స్వర్గమువలె ఆనందముగా నుండెను. చెట్లనిండా పచ్చనిపళ్లు పక్షుల కిలకిలారావములు బాగుగా వికసించిన పువ్వులు పరిమళములు పచ్చనిలేతగడ్డి చూచినంతనే మహా సంతోషముగా నుండెను. నేను తృప్తిగా పళ్లుతిని తీయనినీరు త్రాగితిని. ఆ పళ్ళు, అమృతమువంటి నీరు వలన నాకు మంచిశక్తి కలిగెను.

సూర్యుడస్తమించి రాత్రి అయినవెంటనే మంచిచోట పట్టుపరుపువలెనున్న పచ్చగడ్డిమైదానములో పరుండి నిద్ర పోతిని. కాని ఒకటిరెండుగంటలలో మెలకువవచ్చెను. నేనా నిర్మానుష్యమైన యెడారిలో ఒంటరిగా నుండుటచేత విపరీత మైన భయముకలిగినది. కంటికికునుకురాలేదు. నాలో అనేక విధములైన ఆలోచనలుకలిగెను. "హాయిగా యింటిలో నున్న ధనముతో తృప్తినొందక మరలవర్తకమునకై బయలు దేరితినే! ఆపదలు పొందుచుంటినే?" అని నన్ను నేనే దూషించుకొంటిని. విచారముతో అట్లు మేల్కొనియుండ గానే తెల్లవారిపోయెను. భయాందోళనలు మాత్రము పోలేదు. నేనులేచి దీవిలోని చెట్లమధ్య తిరుగుచు నడచిపోవు చుంటిని. "ఆపదలు వచ్చునేమో! ఏకష్టములుపాలు కావలెనో!" అను తలంపుమాత్రము విడువలేదు. నేనట్లు కొంతదూరము పోయితినో లేదో అక్కడొకముసలివాడు బక్కచిక్కి నీరసముగా సన్నముగా నున్నవాడు కనబడెను. ఆతడొక కాలువగట్టున కూర్చుండెను. వానిని చూడగనే

"ఆతడుకూడ నావలెనే ఓడప్రమాదములో ఆపదనొంది యిక్కడకువచ్చెనేమో" అని మొదటతలచితిని. ఆతని దగ్గరకుపోయి నమస్కరించితిని.

ఆతడు కొంచెము తలవంచాడు. "ఇక్కడేమి చేయు చున్నావు? నీవెవరవు?" అని అడిగితిని. నాకు జబాబు చెప్పకుండానే పళ్లుయేరుకొనుటకు నావీపుపై యెక్కించుకొని కాలువ దాటించమని సంజ్ఞచేసెను. "ఆ ముసలాడు పాపము సహాయము చేయమన్నాడని" జాలిపడి నావీపెక్కించుకొని కాలువ దాటించితిని. నేనక్కడ ఆగి కొంచెమువంగి ముసలి వానిని నెమ్మదిగా దిగుమంటిని. ఆతడు క్రిందకు దిగుటకు మారుగా నాభుజమెక్కి నాకంఠమును తలను చేతులతో గట్టిగాపట్టుకొని నడుమునకు కాళ్ళుచుట్టబెట్టెను. వానిశరీరము నిండా బొచ్చుండెను. ఆవువలె బరువుగావుండెను. ఆతడు నాపీకను గట్టిగా నొక్కివేయుచుండెను. నాకు వూపిరి ఆడుట లేదు. ఆయాసముగానుండెను. చాల అలసిపోయాను. భయ ముతో కాళ్ళువణుకుటచేత క్రిందపడిపోయాను. నేను క్రింద పడినప్పుడైనా ఆ ముసలివాడు నన్ను వదిలిపెట్టలేదు. ఆ క్రూరుడు మెడ గట్టిగాపట్టుకొని కాళ్ళుకొంచెము వదులు చేసినాడు. నేనుకొంచెము సర్దుకొని వూపిరితీసుకొనుచుంటిని. వాడొకకాలితో నాకడుపుపై తన్ని ప్రక్కఎముకలు విరుగు నట్లు రెండవకాలితో గట్టిగాతన్నాడు. నేనెంత ప్రయత్నము చేసినా నన్నువిడిచిపెట్టలేదు.

నేను చేయునదిలేక బలవంతముగాలేచి ఆతనిని మోసుకొని పోవుచు పండ్లచెట్లదగ్గరకు పోతిని. పండ్లేరుకొని నేను తింటిని. కొన్ని ముసలివాడు తినెను. ఆ రోజంతయు నన్నాతడు విడిచిపెట్టక మిక్కిలి బాధపెట్టెను. రాత్రి నేను పడుకొన్నప్పుడుకూడ ఆతడు నామెడను కోతిపిల్లవలె గట్టిగా పట్టుకొనే నిద్రించినాడు. ప్రతిరోజును యిట్లే నన్ను గట్టిగా కొట్టి నేను నడుచునట్లుగా బాధపెట్టేవాడు. వానిని విడిపించుకొనుటకు చాల ప్రయత్నములు చేసితిని. నేనెట్టి ఆపదలోనుంటినో! యెంతబరువు మోయుచున్నానో! మీరే వూహించుకోవలెను. నేను చెప్పజాలను. వాడు కాళ్ళతో తన్ని వాడికికావలసినట్లు పనిచేయించుకున్నాడు. ముసలాడికి చేసినసేవ, అనుభవించినబాధ నాజన్మలో యెన్నడూపడలేదు. దయాదాక్షిణ్యములులేని ఆ క్రూరుణ్ణి వదుల్చుకోడానికి ప్రయత్నములు చేయసాగితిని. ఇట్లుకొన్నిరోజులు చాల కష్టముగా గడిచినవి.

ఒకరోజున నేను ముసలివానిని మోసుకొని పోవుచుండగా ఒకచోట యెండిపోయిన ఆనబకాయలు కనబడెను. ఒక ఆనబకాయ తీసికడిగి శుభ్రముచేసి ఆ బుర్రలో ద్రాక్షపళ్ళరసముతీసి నిండాపోసితిని. ఆ దీవిలో ద్రాక్షపళ్ళు కుప్పతిప్పలుగా నున్నవి. ఆ రసము రెండుమూడు రోజులు పోయిన తర్వాత త్రాగితిని. ఆ ద్రాక్షరసముచే నాకు ఆరోగ్యము అమితబలము కలిగెను. నేను పొందినబాధలు ఆయాసము మరచిపోతిని. నేను ఉల్లాసముగా ఆడుచుపాడుచు ముసలి

వానిని మోసుకొని పోసాగితిని. నేను నాట్యంచేస్తూ చప్పట్లు కొట్టుతూ ఆనందముగా నుండుటచూచి ముసలివాడు ఆ ద్రాక్ష రసమును ఆతనికికూడ కొంచెము యిమ్మని సంజ్ఞచేసెను. నేను చాలసారాయిగల ఆ ఆనబకాయ బుర్రను యిచ్చితిని. ముసలివాడు రుచిగా నుండుటచే కడుపునిండా సారాయిని త్రాగివేసెను. ఆతనికి వళ్ళు తెలియని ఆనందమెక్కువై నా భుజములపై నే గంతులువేసి యెగురసాగెను. ఆతనికి వళ్ళు తిరిగి కళ్ళుచీకట్లు క్రమ్మినవి. కండరాలలో శక్తినశించినది. డోకులు ప్రారంభించినవి. ఆతని చేతులకు కాళ్ళకు పట్లుతగ్గినవి. ఇక కాళ్ళతో నన్నుగట్టిగానొక్కి పట్టుకొనలేక పోయినాడు. వెంటనే నేనిదేసమయమని ఆ దుర్మార్గుని నేలపై విసరికొట్టితిని. వాడు కదలక మెదలక పడివున్నాడు. వెంటనే నేను ధైర్యమువహించి ఒక పెద్దరాతిబండను తెచ్చి, వానితల చితకపొడిచి చంపివేశాను. ఆ దుర్మార్గుడు చచ్చినందుకు వానిపీడ వదిలినందుకు, మిక్కిలి సంతోషించితిని. ఇకనాకు వాడిచెరవదిలినది. దైవము నాపై అట్లుకరుణజూపి ఆపద నుండి తప్పించి రక్షించినాడు.

పిమ్మట నేనుసముద్రతీరమునకు వేగముగా నడచి పోయితిని. దైవకృపచే ఒక ఓడలంగరువేసి ఆగినది. నావికులు అచటనీరు నింపుకొని పండ్లేరుటకు ఆగిరి. అచ్చట నన్నుచూచి ఓడలోని ప్రయాణీకులు ఓడకెట్టైనకూడ చాల ఆశ్చర్యపడిరి. నాచుట్టూమూగి అనేక ప్రశ్నలడిగిరి. నేనువారికి నాకు సంభవించిన చరిత్రను, అనుభవములను చెప్పితిని. నాసాహస

చర్యలను విని మిక్కిలి ఆశ్చర్యపోయిరి. ఆ ముసలివాని చెర నుండి రక్షింపబడి బ్రతికిబయట పడినందులకు మిక్కిలి సంతోషించిరి. "ఈ ద్వీపము ఆ ముసలివానిచేతనే ఓరంగుదీవని ప్రసిద్ధికెక్కినది. ఆ ముసలివాడు సముద్రపు నీటిమనిషి. వాడు మనుష్యులను లెక్కలేనంతమందిని చంపితినెను. నీవు అదృష్టముచే బ్రతికి బయటపడిన వారిలో మొదటివాడవు. నావికు లెప్పుడును యీ దీవిలోనికి వెళ్ళుటకు జంకుదురు." అని ఓడనాయకుడు మాతో చెప్పెను.

వారి ఓడలో ప్రయాణము చేసి కొలదిరోజులకొక పట్టణము చేరితిమి. ఆ పట్టణములోని యిండ్లన్నియు మంచి రాళ్ళతో కట్టబడియుండెను. ఆ నగరమునకు అనేక దేశముల నుండి వర్తకులువచ్చి పోతూవుంటారు. ఓడలోని వర్తకులలో ఒకడు నాతో మిక్కిలి స్నేహముగానుండెను. అతడు నన్ను కూడ తీసుకొని విదేశవర్తకులుండు బసకు వెళ్లెను. నాకొక పెద్దసంచియిచ్చి, ఆ పట్టణవాసులతో కూడ వెళ్ళమని సలహా యిచ్చెను. వారుచేసినట్లే చేయమని, వారిని విడిచిపెట్టవద్దని, విడిచిపెట్టిన ప్రాణహాని కలుగునని చెప్పెను. వారు కొబ్బరి కాయలు పోగుచేసి తెచ్చెదరు. నీవుకూడ వారివలె కొబ్బరి కాయలు పోగుచేసి తెచ్చుకొనుము." అని చెప్పెను.

నేనాహారము తిని వారితో బయలుదేరి వెళ్ళితిని. మేమందరము చిన్నచిన్న రాళ్ళు సంచులనిండా పోగుచేసు కొంటిమి. నగరమునకు దూరముగానున్న ఒకఅడవిలోనికి పోయితిమి. అచ్చటిచెట్లన్నియు నున్నని ప్రమానులతో

పొడుగుగానుండెను. మిగుల ఎత్తైనవి. ఆ చెట్లను మనుష్యులు పండ్లున్న కొమ్మలువరకు యెక్కుట మిగులకష్టము. అవన్నియు కొబ్బరిచెట్లే. మేమూ అరణ్యములో లెక్కలేనన్ని నల్లని కోతులను కొండముచ్చులను చూచితిమి. మమ్మలనందరిని చూచి ఆకోతులు భయపడి వేగముగా చెట్లుచిగురికి యెక్కిపోయినవి. నాతోవచ్చిన వర్తకులందరు రాళ్ళనుతీసి చెట్లపైనున్న కోతులపై విసరిరి. నేనుకూడ అట్లే రాళ్ళనుతీసి కోతులపై విసిరితిని. ఆ కోతులు మాపై కోపముతో పగతీర్చుకొనుటకై చెట్లకొబ్బరికాయలుతీసి మాపై క్రిందకి విసరసాగినవి. కోపము తీరేవరకు కాయలుతీసి విసిరేవి. మేము కాయలను యేరుకొని, మళ్లా కోతులపై రాళ్లు రువ్వేవారము. కోతులు కోపముతో కాయలుతీసి క్రిందకు విసిరేవి. ఈ వుపాయమువల్లనే అచ్చట కొబ్బరికాయలు ప్రోగుచేయకలము. కాని మరి యింకొకవేరే యితరమార్గములేదు. మేమందరము పంచులనిండా కాయలు పోగు చేసుకొని పట్టణమునకు నా స్నేహితుడగు వర్తకునిదగ్గరకు వచ్చితిమి. ఆ వర్తకుడు నాకొబ్బరికాయలు తీసుకొని ఖరీదు యిచ్చివేసెను. ఆతడు నన్ను మరల కాయలు తెమ్మని ప్రోత్సహించెను. " ఈకాయలు అమ్ముటవల్లనే నీవు చాలసొమ్ము గడించి యింటికి తీసుకొనిపోవలెను " అనెను.

ఆతడు నాకిచ్చిన యీ మంచిసలహాకు సంతోషించి ఆతనిని పొగడితిని. చాల కొబ్బరికాయలు తెచ్చి అమ్మి అపరిమితమైన ధనమును సంపాదించితిని. నేను వచ్చిన ఓడనిండా

కొబ్బరికాయలతో నింపివేసిరి. ఇంకొక ఓడకూడ వచ్చినది. దానిని కూడ కొబ్బరికాయలువేసి నింపిరి. నాపై ప్రేమజూపిన వర్తకునియొద్ద శలవుతీసుకొని ఓడయెక్కితిని. ఆతనిపని యింకను పూర్తికాకపోవుటచే మాతోరాక ఆతడు ఆగిపోయెను. నాతోకూడ చాల కొబ్బరికాయలు తీసుకొని బయలుదేరితిని. మేము ఓడప్రయాణము చేయుచు కోహలురీద్వీపము చేరితిమి. అచ్చట మిరియాలు, ఏలకులు, ముసాంబరము, లవంగాలు యెక్కువగా దొరకును. నా కొబ్బరికాయలు అమ్మి మిరియాలు మున్నగు పరిమళ ద్రవ్యములుకొని యితరద్వీపములలో అమ్మి విస్తారము సొమ్ముగడించితిని. యింకొకచోట ముత్యములు మంచి పెద్దవి సంపాదించి ధనము కూడబెట్టితిని.

తుదకు ప్రయాణము సాగించి మిరియాలు, ఏలకులు, ముసాంబరముకొని పడవనింపి అమ్మితిని. కొలదిరోజులలో బాల్సొరా, అచ్చటినుండి బాగ్దాదుపట్టణమునకు వచ్చితిని. ఈ వర్తకవ్యాపారములో లెక్కలేనంత ధనము దొరికినది. నాసొమ్ములో చాలభాగము బీదలకు అన్నదానము చేసితిని. మిగిలిన నాఐశ్వర్యముతో సర్వసౌఖ్యము లొందుచుంటిని." అని చెప్పి నూరురూపాయలు హిందుబాదునకు బహుమాన ముగా యిచ్చెను. ఆతడు సంతోషముతో వెడలిపోయి మరు నాడు విందుభోజనమునకు మామూలుగావచ్చెను. భోజనము లైన తరువాత సిందుబాదు ఆరవప్రయాణమును గూర్చి చెప్పసాగెను.

## 6 వ ప్రయాణము

అన్నా! నాకిన్నిసార్లు పడవ ప్రమాదము సంభవించి పెక్కు ఆపదలు, కష్టములువచ్చినవి. మరలయెట్లు ప్రయాణమైపోవుటకు సాహసించితినో! అని నీకు సందేహాము కలుగవచ్చును. నా అదృష్టమును తలచుకొని దానిని మరల పరీక్ష చేయుబుద్ధి కలిగినది. ఎన్నికష్టములైన సహించి, ధనమును సంపాదింప కోరికపుట్టినది. అది తలచుకొన్న నాకే ఆశ్చర్యముగా నున్నది. ఇట్లనుకొనుచు ఒకసంవత్సరమువరకు సుఖభోగము లనుభవించుచు గడిపితిని. నా గ్రహాబలము చాల బలముగనుండుటచే నన్ను మరల ప్రయాణము వైపునకు లాగివేసినది. నా బంధుమిత్రులు నన్నుబయులుదేరి వెళ్ళవద్దని, అనేకరీతుల బోధించిరి. వారిమాటలు బోధలు కొంచమైనను నన్నాపుటకు ఉపకరించలేదు. ఏమిచేయను? తుదకు ప్రయాణమై వెళ్ళుటకే నిశ్చయించుకొంటిని. సామానులన్నియు బేళ్ళుగా అమర్చి, ఓడలో సర్దుకొంటిని. మంచిరోజున సముద్రములో ప్రయాణము సాగించితిని. గాలిబాగుండెను. పెరిషయా మీాదుగా చాలరాజ్యములు దాటితిని. చాలదూరము ప్రయాణముచేసి ఒకరేవుపట్టణము చేరితిమి. ఇంకను అచటినుండి చాలదూరము పోతిమి.

ఇంతలో ఓడయజమాని చుక్కానివాడు కూడ మార్గము తప్పిపోయిరి. వారు పనిమానివేసి గట్టిగా తలబాదు

కొని యేడవసాగిరి. వారిదుఃఖముచూచి మాకు చాలభయము వేసినది. ఓడకెప్టెను "అయ్యో దేముడా!" అని తలపాగా తీసి పారేసి, జుట్టుపీకుకొని గెడ్డములాగుకొని తలమొత్తుకొని పిచ్చివానిలాగ కేకలుపెట్టి యేడ్వసాగెను. మాకెవ్వరికిని కారణము తెలియలేదు. "అసలు దీనికికారణమేమిటి? నీవెందుకు యేడ్చుచున్నావు." అని మేమడిగితిమి. "అన్నలారా! మనము మహాపదలోనున్నాము. మనఓడ అపాయస్థలములో చిక్కుకొన్నది. ఇక్కడి ప్రవాహవేగమునకు కొట్టుకొనిపోయి, మనఓడ యిక ఒకగంటలో ముక్కముక్కలుగా అయిపోవును. మనమందరము నాశనమగుట నిశ్చయము. "దేవుని యీ ప్రమాదమునుండి తప్పించిరక్షింపుమని" ప్రార్థనచేయుడు. దేవుడు మనపై కరుణచూపనిచో మనకష్టమును తప్పించుకొనలేము." అని కెప్టెను మాతో చెప్పెను.

ఆతడు తెరచాపలను క్రిందికిదింపివేసి ఓడరక్షణకు ప్రయత్నములుచేసెను. కాని ఆ ఓడ త్రాళ్ళన్నియు తెగిపోయెను. ఓడనిస్సహాయ స్థితిలోపడి గిరగిరతిరుగుచు ప్రవాహవేగములో కొట్టుకొని పోవుచు ఒకపర్వతమునకు గట్టిగా ఢీకొని, ముక్కలై బద్దలై పోయెను. కాని మేముమాత్రము ప్రాణములతో బైటపడితిమి. చాల సామానుకూడ మునిగిపోకుండ కాపాడితిమి. ఇదైన తరువాత "అన్నలారా! దేవుని కిష్టమైనట్లు అయినదేదో అయిపోయినది. మనము

మహాపాయములో చిక్కుకొంటిమి. ఇక్కడ ఓడప్రమాద
ములో పడినమనుష్యులు యికతిరిగి బ్రతికి యింటికి పోలేరు.
వారిక్కడే ప్రాణములు విడిచి చనిపోదురు. ఎవరి గోరీ వారే
కట్టుకుందురు” అని విచారముతో కెప్టెను చెప్పెను. ఆతని
మాటలు వినగానే మాకు మతిపోయినది. ఒకరి నొకరు గట్టిగా
కౌగలించుకొని గట్టిగా యేడ్చితిమి. మా దుఃఖమునకు పరి
మితిలేదు. అట్లు చాలసేపు యేడ్చుచు కూర్చుంటిమి.

మేమున్న పర్వత మొక ద్వీపమునకు తీరముగా నున్నది.
అక్కడే చాల ఓడలు విరిగి ముక్కముక్కలై పడిపోయి
వున్నాయి. మనుష్యుల యెముకలు యెక్కడపడితే అక్కడ
గుట్టగుట్టగా నున్నవి. వాటినిచూచి మాకు గుండెనీరయి
పోయినది. ఏమిచేయుటకు తోచలేదు. అనేకవేలమంది జనులు
చచ్చిపోయి యుందురని తలంచితిమి. అక్కడ ఎంతో విలువ
గల బంగారము—నగలు—ధనరాసులు పోగులుగా వున్నవి.
ఆ ధనరాసులు చూచినంతనే మాకు కొంచెము విచారము
తగ్గినది. సాధారణముగా నదులన్నియు భూమిపై ప్రవహించి,
ప్రవహించి తుదకు సముద్రములో పడును. కాని యిచ్చట
ఒక మంచినీటి ప్రవాహము సముద్రములోనుండి ఒక చీకటి
గుహలోనికి పారుచున్నది. దాని ద్వారము మిక్కిలి విశాలము
గాను యెత్తుగానుండెను. ఆ పర్వతములోని రాళ్ళన్నియు
స్ఫటికములు, కెంపులు, మాణిక్యములు, రత్నములవంటి
మిగుల విలువైనవి. ఇచ్చటే మరొక వింతైన నీటిప్రవాహము
భూమిపైనుండి సముద్రములోనికి పారుచున్నది. ఆ నదిలో

నీటిని చేపలు మింగి మరల కక్కివేయును. అవి కక్కినదే కర్పూరపూసలుగా మారిపోవుచున్నవి. ఇట్టి కర్పూరపూసలు రాసులుగా అచ్చట కెరటములచే వడ్డునకు కొట్టుకొనివచ్చి పడియున్నవి. మరియు అచ్చటే సాంబ్రాణి ముసాంబరము చెట్లు చాలకలవు.

మేమున్న సముద్రము ఒక సింధుశాఖ. దాని మూడు వైపులను పర్వతములే వున్నవి. ఒక వైపున మాత్రము సముద్ర మున్నది. ఆ సింధుశాఖలో ప్రవేశించిన ఓడ మరి యిక యీవలకు రాలేదు. సముద్రములోని గాలివీచిన పర్వతములకు ఓడతగిలి పగిలిపోవును. భూమిపైనుండి వీచినగాలికి ఓడ నీటి ప్రవాహములో గుండ్రముగాతిరుగుచు కొట్టుకొనిపోయి మునిగి పోవును. యిట్టి ఆపదలో తగులుకొనిన ఓడ యేవిధముగాను పైకిరాలేదు. ఈవిధముగనే మాఓడ ముక్కలై పోయినది. మేమూ సముద్రతీరముననే చాల రోజులు ఆగియుంటిమి. ప్రతినిముషమునందు చావు తప్పదేమోనని తలచుచుంటిమి. మాకున్న ఆహారమును మేమందరమును సమముగా పంచుకొంటిమి. మా ప్రతివాని జీవితము మా ఆహారము కొంచెమో గొప్పో తినుటపైనే ఆధారపడియున్నది. కొంచెము తిన్నవాడు యెక్కువరోజులు బ్రతకవచ్చును. యెక్కువ తిన్నవాడు తక్కువకాలమె బ్రతకగలడు. మేమందరము యెట్లో రోజులు గడుపుచుంటిమి. మా స్నేహితులు ఒక్కొక్కరు క్రమక్రమముగా మరణించసాగిరి. నా కడసారి సేవలు అందరికిని అర్పించితిని. స్నేహితుడు చేయవలసిన సహాయము

నేనందరికిని చేసితిని. నీకు ఆశ్చర్యము కలుగవచ్చును! నా స్నేహితులందరును చనిపోయిరి. అదృష్టవశముచే నేను ఒకడను మాత్రమే బ్రతికియుంటిని. నా ఆహారమునేగాక చనిపోయిన నా స్నేహితుల ఆహారముకూడ నేనేతీసుకొని నెమ్మదిగా వుపయోగించి మరికొన్నిరోజులు జీవించితిని. ఇక మరణము తప్పదని నిశ్చయించుకొంటిని. నాకు సహాయము చేయువారు లేకపోవుటచే నా సమాధిని నేనే త్రవ్వియుంచుకొంటిని. "నా చావునకు నేనే కారణమని దురాశతో ధనమునకై ఇల్లువిడిచి మరల ప్రమాదములో తగుల్కొంటినని" నన్ను చాల దూషించుకొంటిని. కళ్లు చిల్లులుపడునట్లేడ్చితిని. చావు సమీపించుచున్నదని దిగులుతో మతిలేక కూలబడితిని.

కాని దేవునికరుణ నాపై మరల కలుగుటచే మెరుపు మెరసినట్లు నాకొక ఆలోచన తట్టినది. చీకటి గుహలోనికి పారుచున్న మంచినీటి కాల్వగట్టుపై కూర్చుండ బుద్ధిపుట్టినది. నేను తదేకధ్యానముతో ప్రవాహములోనికి చూచితిని. "ఈనీటి ప్రవాహము భూగర్భములోనుండి యెక్కడికో పారుచున్నది. ఇది పైకివచ్చి యెక్కడో తప్పక ప్రవహించక మానదు. అందుచే చిన్నతెప్పలుకట్టి యందులో కూర్చుండి పోయినచో యెక్కడో ఒకచోట జనులుండు దేశము పోయి చేరవచ్చును. లేకున్న నీటిప్రవాహములో యెక్కడో మునిగి పోదును. నేను నీటిలో మునిగిపోయినా నష్టమేమిలేదు. ఒక విధమైన చావునకు ఇంకొక రకమైన మరణమేకదా! వచ్చును. ఇక్కడ చచ్చేకంటె ప్రవాహములో కొట్టుకొనిపోయి అక్కడ

చచ్చుటే మేలు! నేను బ్రతికితినా ధనసంపాదనకై కొన్ని క్రొత్త అవకాశములు దొరకును. యెవడెరుగును? యెట్టి అదృష్టము కలుగనున్నదో? నా ఆపదలు యింతటితో తీరిపోగూడదా?" అని తలచెను.

వెంటనే కొన్ని బలమైన కఱ్ఱలు కలపతో గట్టిగా బిగించికట్టి ఒకచిన్న తెప్పకట్టి తయారుచేసితిని స్ఫటికములు, కెంపులు, రత్నములు, బంగారునగలు బేళ్ళుగాకట్టి ఆ తెప్పపై పెట్టి కట్టితిని. దైవముపై భారమువేసి ఆ నీటిప్రవాహములో తెప్పను నెమ్మదిగా నడుపుచు పోవుచుంటిని. కొంచెము సేపటిలో నేను చీకటిగుహాలో ప్రవేశించితిని. కన్నుపొడుచు కొన్నను యేమి కనుపించుటలేదు. అంతా చీకటిమయముగా నుండెను. ఆ తెప్ప యెచ్చటికి పోవుచున్నదో యేమి తెలియుట లేదు. నేనుప్రవాహములో తెప్పపై వేగముగా కొట్టుకొని పోవుచుంటిని. అట్లుపోవుచుండ కొన్నిదినములకు ఒకచోట విల్లు వంపుగానున్న ఒకరాతికట్టడము చేరితిని. అది చాల క్రిందుగా నుండుటచే నాతలకు గట్టిగా రాయితగిలె తగిలెను. ఆ దెబ్బకు నాతల పగిలిపోవలసినదే! ఇక అంతటినుంచి నేను జాగ్రత్తగా తలవంచుకొని తెప్పలో కూర్చుంటిని ఇక నాకు అట్టి ప్రమాదము రాలేదు. ఇన్నిదినములనుండియు నాకు కడుపునిండా తృప్తిగా భోజనములేదు. ఆహారము అయిపోయి నది. నీరసము యెక్కువై శరీరము కృశించిపోయినది. అలసటచే నేను మత్తుగా చాలసేపు నిద్రించితిని. నేనట్లు యెంతవరకు నిద్రించితినో చెప్పలేను. కాని నేనుమేల్కొని చూడగా

ఒకవిశాలమైన రాజ్యములో మధ్య ఉంటిని. యొకనది యొడ్డున నీగ్రోగుంపులో నా తెప్ప కట్టబడియుండెను. నేను మహాశ్చర్యములో మునిగిపోతిని. నీగ్రోలను చూచిలేచి నమస్కరించితిని.

ఆ నీగ్రోలు నాతో యేదోమాట్లాడిరి. కాని వారి భాష నాకు తెలియలేదు. నేను కలగంటినా? నిద్రలో నుంటినా? మేల్కొనియుంటినా?" అను ఆలోచనతో నుంటిని. "సర్వశక్తులుగలదైవమును కొనియాడుము. నిన్ను గూర్చి కంగారుపడకుము. కళ్ళు మూసికొనుము. భగవంతుడే నీకు అన్ని మేళ్లు చేకూర్చును. చెడ్డను మంచిగా మార్చి వేయును. నీకు మేలు కలుగును." అనుమాటలు నా చెవులకు వినబడెను. నేను మిక్కిలి సంతోషించితిని. నా ఆనందమునకు మేరలేదు.

అంత ఒకనీగ్రోవాడు నా దగ్గరకువచ్చి "అన్నా! మమ్ముచూచి ఆశ్చర్యపడకుము. మేమీ దేశస్థులము. ఈ రోజున మా భూములకు నీరు పెట్టుకొనుటకై వచ్చితిమి. ఈ నీటిప్రవాహములో తేలుచు యేదో కొట్టుకొని వచ్చుచుండుటచూచితిమి. మాలో ఒకడు యీ తెప్పతో నిన్ను చూచి యిచ్చటకు తీసుకొనివచ్చినాము. నీ చరిత్ర యేమి? నీవు చాల సాహసునివలె నున్నావే? ఈ ప్రవాహములో యెట్లురాగల్గితివి?" అని చెప్పి అడిగెను. నేనువారితో "నాకు చాల ఆకలిగా నున్నది. నీరసముగా నున్నది. ముందు అన్నము పెట్టుడు. ఆహారము తిన్నపిదప మీ కోరిక తీర్చి నాకథ

చెప్పెదను." అని అంటిని. వారు నాకు మంచిమంచి రుచి గల అనేకరకములైన పదార్థములు పెట్టిరి. నాకు ఆకలితీరునట్లు తృప్తిగా భుజించితిని. పిమ్మట నేను బయలుదేరినది మొదలు అప్పటివరకు నాకు కలిగిన కష్టములు వర్ణించిచెప్పితిని. నాచరిత్రను వారు చాల ఆశ్చర్యముతో వినిరి. ఇట్టి సాహస చరిత్రను యెక్కడను వినలేదనిరి. ఈ కథను నేనే స్వయముగా తమరాజుగారితో చెప్పుటకై తీసుకొనిపోదలచిరి. నేను మీారెక్కడికి రమ్మన్న అక్కడికి వచ్చుటకు సిద్ధముగా నున్నానని" వారితో చెప్పితిని.

ఆ నీగ్రోలు నాకొరకు మంచిబలమైన గుర్రమును తెచ్చిరి. నేనా గుర్రమునెక్కి బయలుదేరితిని. నావెంట కొందరు దారిచూపుచు నడిచివచ్చిరి. మిగిలినవారు నా తెప్పను సామాగ్రిని తీసుకొని బయలుదేరివచ్చిరి. మేమం దరమట్లు బయలుదేరి ప్రయాణముచేసి సెరండిబ్ ద్వీపమునకు ముఖ్యపట్టణమైన సిలను చేరితిమి. నీగ్రోవారు నన్ను తీసుకొని పోయి వారిరాజునకు సమర్పించిరి. నేను రాజుసింహాసనము చెంతకుపోయి రాజునకు వంగినమస్కరించితిని.ఆ రాజు నన్ను గౌరవముగా లేవదీసి కౌగలించుకొని ప్రక్కనే కుర్చీలో కూర్చుండబెట్టెను. ఆ రాజు మిక్కిలి సంతోషముతో నీ పేరేమి ? నీవు నారాజ్యమున కెట్లురాగల్గితివి ? నీవు మొదట యెక్కడ బయలుదేరితివి ? అంతయు చెప్పుము ?" అని అడిగెను.

నేను "రాజా! నాపేరు సిందుబాదు. నేనొక వర్తకుడను. నాది బాగ్దాదుపట్టణము. నేను పడవప్రమాదమున ఆపదలొంది యిచ్చటకు నీగ్రోలవలన రాగల్గితిని" అని మొదటినుండి నా సాహసచరిత్ర చెప్పితిని. ఆ ప్రభువు నాకథ విని మిక్కిలి ఆశ్చర్యపడి నేను జీవించినందుకు ఆనందించెను. నాసాహసకార్యములను బంగారు అక్షరములతో వ్రాయించి రాజదర్బారులోని గ్రంధభాండారము (రికార్డు ఆఫీసు)లో భద్రపరచెను. పిమ్మట నా తెప్పను రాజుగారి యెదుటకు తెప్పించితిని. అందుగల బేళ్ళనువిప్పి రత్నములు, వజ్రములు, కెంపులు బంగారునగలు, కర్పూరపు పూసలు అన్నియు రాజునకు చూపించితిని. వాటినిచూచి రాజు మిక్కిలి సంతోషించి "ఇట్టి విలువగల రత్నములు, యింతపెద్ద వజ్రములు నా ధనాగారములోకూడ లేవు" అని చెప్పెను. ఆ విలువగల నగలు ఒక్కొక్కటే తీసి చూచి పరీక్షించి చాల ఆనందించెను.

ఆ రాజు రత్నసరుకును చూచునప్పుడు నేను నమస్కరించి "ప్రభూ! నేను మీపాదసేవకుడను. ఈ రత్నరాసులు ధనముమీదే దీనిని మీకు సమర్పించితిని. దీనిని తీసుకొని మీ యిష్టమువచ్చినట్లు వుపయోగించుడు." అని అంటిని. రాజు నవ్వుచు సిందుబాదు నీ మాటలచే నాకు పరమసంతోషమైనది. నీ ధనము నా కేమియువద్దు. దైవము నీకీధనమిచ్చెను నీవు యింకను నా రాజ్యములో ఐశ్వర్యవంతుడవు కాగోరుచున్నాను. అని ప్రేమతో ఉదారముగా చెప్పెను.

ఆతడు దయతో నాకు సర్వసౌఖ్యములిచ్చి కాపాడమని కొందరు వుద్యోగస్తులను రక్షణగా నియమించెను. ప్రజలను నాకు విధేయులై సేవచేయునట్లు వుత్తరవుచేసెను. నా ధనమును రత్నసరకులను బంగారునగలుగల పేళ్ళను నా బసలోనికి పట్టించుకొని పోతిని. నేను ప్రతిదినము రాజ దర్శనమునకు పోవుచు పట్టణములోని వింతలు చూడసాగితిని. సెరండిబీదీవి చాల పొడుగు వెడల్పుగల దీవి. దీని ముఖ్యపట్టణము పర్వత లోయలో నున్నది. ఈ ద్వీపములో మధ్యగ యెత్తైన పర్వతము కలదు. ఇచ్చట విలువైన రత్నములు, పగడములు, వజ్రములు విలువగలరాళ్లు విస్తారము కలవు. అచ్చట అన్నిరకములైన చెట్లుకలవు. ముఖ్యముగా దేవదారు-కొబ్బరిచెట్లు యెక్కువగా పెరుగును. ముత్యములు-వజ్రములు యెక్కువగా నదీలోయలో విస్తారము దొరకును. నేను భక్తిగా పర్వతముపై కెక్కి తిరిగి వచ్చితిని. నేను రాజుగారి శలవు తీసుకొనుటకై ఆయన దర్శనమునకు పోయితిని. రాజు కరుణతో నాకు అమితమైన ధనమును బహుమతీగా యిచ్చెను.

ఇంతేగాక మా దేశపు చక్రవర్తికి గౌరవముగా యిమ్మని కొన్ని బహుమతులు, ఒక వుత్తరము వ్రాసియిచ్చెను. ఆతని స్నేహమును కోరుచుండెనని చెప్పమనెను. ఆ వుత్తరమును బహుమతులను నేను మిక్కిలి గౌరవముతో తీసుకొంటిని. వీటిని మా చక్రవర్తికి అందచేయుదునని చెప్పగానే ఆ రాజు మిక్కిలి ఆనందించెను. నేను ఓడయెక్కి ప్రయాణము చేయుటకు ముందుగా ఓడ యజమానిని పిలిపించెను. ఆతనితో

" ఈ సింద్‌బాదును నీవు శక్తివంచన లేకుండ సుఖముగా నీఓడలో తీసుకొని వెళ్లుము " అని ఉత్తరవు చేసెను. నేను ఓడలో ప్రయాణమునకై బయలుదేరితిని. ఓడ యజమాని నన్ను మిక్కిలి గౌరవముతో ఆదరించెను.

సిరండిబ్ రాజు చక్రవర్తికి వ్రాసిన ఉత్తరము ఒక గొప్ప పచ్చని తోలుపై వ్రాయబడెను. ఆ తోలు చాల సున్నితము, ఖరీదుగలది. ఆ ఉత్తరములోని అక్షరములు నీలిరంగుతో వ్రాయబడెను. ఆ ఉత్తరములోని భావము.

మీరు ఇండీస్ దీవుల చక్రవర్తులు. మీముందు నూరు యేనుగులబారు నడచును. మీరు నూరువేల రత్నములు కెంపులతో ప్రకాశించు కోటలో నివశించుచున్నారు. మీ ఖజానాలో ఇరవై వేల బంగారు మొహిరీలు లెక్కలేనన్ని వజ్రములుకలవు. అట్టి ఐశ్వర్యవంతులగు హరూన్ ఆల్ రసీదు ప్రభువు వారికి నమస్కారములు—మేముపంపిన బహుమతీ బహు స్వల్పము. అయినను నన్ను సోదరునివలె స్నేహితునివలె భావించి యీ బహుమతీని తీసుకోవలెను. హృదయపూర్వకముగా ఆనందించవలెను. మేము యిందుకుతగిన నిదర్శనములు యిచ్చెదము. మీతో సమాన గౌరవములుచూపి మాతో యెల్లప్పుడు స్నేహముగా నుండకోరుచున్నాము. మమ్ములను సోదర సమానముగా భావించవలెను.

ఇట్లు

మీ సేవకుడు నమస్కారములు.

బహుమతీలో మొదటిది:- ఆరు అంగుళముల పొడవు అంతే వెడల్పు అరంగుళము దళసరిగల ఒకే రత్నముతో చేసిన రవలుచెక్కిన గిన్నె. దానినిండా మంచి పెద్ద రకము ముత్యములు, ఒక్కొక్కటి అరఔన్సు ఎత్తుగలది.

రెండవది;- ఒక రకము పాముతోలు. ఈచర్మముపై పరున్నవారికి యెట్టి రోగములున్న క్షణములో పోవును. అట్టి మహాశక్తిగల తోలు.

మూడవది:- లక్ష తులముల పచ్చకర్పూరము. బాదం కాయంత ముక్కలుగలవి యాభై వేల తులముల మసాంబరము.

నాల్గవది:- బంగారునగలు పట్టుబట్టలతో అలంకరింప బడిన మిక్కిలి అందగత్తెయగు పరిచారిక.

నేను జయప్రదముగా ప్రయాణం ముగించుకొని బాల్సారా అక్కడనుండి బాగ్దాదు పట్టణమునకు చేరితిని. నేనక్కడ చేరగానే హరూన్ ఆల్ రసీదు చక్రవర్తిగారి కోటకు నే తెచ్చిన కానుకలు పట్టించుకొని వెళ్ళితిని. ద్వారపాలకుడు రాజసభకు దారిచూపి తీసుకొనిపోయి అక్కడ ఆపెను నేను చక్రవర్తి సింహాసనము దగ్గరకు వెళ్ళి చక్రవర్తికి వంగివంగి సలాములు చేసి గౌరవించితిని. నా చరిత్రను చెప్పి ఆ రాజిచ్చిన కానుకలను వుత్తరమును చక్రవర్తికి సమర్పించితిని. చక్రవర్తి ఆ వుత్తరము చూచుకొని "ఆరాజు నిజముగా అంత భాగ్యవంతుడా? అంత శక్తిబలము కలవాడా?" అని నన్ను అడిగెను. నేను నమ్రతగా మరల సలాముచేసి "మహాప్రభూ! ఆ రాజు వ్రాసినదంతయు నిజము. సత్యదూరంకాదు. నేను కండ్లారచూచి వచ్చితిని. ఆతని ఐశ్వర్యము-వైభవము మనుష్యులు వర్ణించి

చెప్పజాలరు. ఆ రాజు యేనుగ అంబారిపై కూర్చుండి తిరుగును. మంత్రులు పెద్ద వుద్యోగస్తులు కూడవచ్చెదరు. బంగారు బల్లెములు కొందరు పట్టుకొనియుందురు. కొందరు బంగారు గదలు పట్టుకొందురు. రత్నములు స్థాపించిన బంగారు కర్రలు పట్టుకొని జల్తారు అంచులుగల పట్టుబట్టలు ధరించి వేలకొద్ది జనులు కూడ నడిచెదరు. అలంకరింపబడిన యేనుగులపై యెక్కి చాలమంది రాజుతో వచ్చెదరు. అంగరక్షకులు కైవారములు చెప్పి 'రాజునకు జై జై' అని కేకలు వేయుదురు.

ఆ రాజు మంచి ఉదారుడు. అందరికంటె గొప్పవాడు. అంత న్యాయమూర్తి మరి లేడు! అచటి ప్రజలును రాజువలెనే న్యాయవర్తనులు అని నేను చెప్పితిని. ఆ చక్రవర్తి నాకు అపరిమితముగా బంగారు నగలు ధనము కానుకలిచ్చెను. నేను శలవుతీసుకొని యింటికి అపరిమిత ధనరాసులతో వచ్చితిని. అని సిందుబాదు చెప్పి హిందుబాదునకు నూరు రూపాయలు కానుకయిచ్చెను. మరునాడు ఆతడు వాడుకప్రకారము విందునకు వచ్చెను. సిందుబాదు తన యేడవ ప్రయాణమును గూర్చి చెప్పదొడగెను.

## 7 వ ప్రయాణము ఆఖరు ప్రయాణము

అన్నా! నా ప్రయాణము ముగించుకొని వచ్చినతరువాత యిక ప్రయాణమును గూర్చిన ఆలోచన బొత్తిగా విడిచిపెట్టితిని. నా యింట్లో సుఖముగా విశ్రాంతిగా ఉండదలచితిని. వర్తకము చేయు తలంపులేదు. నాకు వయసు మీరిపోయినది. యిక యేకష్టములను ఆపదలను

సహింపలేను. ఇంక నా దేశమును యిల్లును విడిచి కదలకూడదని గట్టిగా నిశ్చయించుకొంటిని. నా జీవితమును ఆనందముగా వెళ్ళబుచ్చదలచి సుఖముగా నా స్నేహితులతో ఖులాసాగా మాట్లాడుచుంటిని. ఇంతలో ఒక నౌకరువచ్చి "మీతో మాట్లాడుటకై చక్రవర్తిగారు రమ్మని పిలిచిరి. ఎవరో వుద్యోగస్తుడు వచ్చినాడు" అని నాతో చెప్పెను. నేనా వుద్యోగస్తునితో కూడకలిసి చక్రవర్తిగారి దర్బారునకు పోయితిని. నవాబునకు వంగి నమస్కారములు చేసితిని, నవాబు నన్ను గౌరవముగా ఆదరించి కూర్చుండబెట్టెను. "సిందుబాదు! నీవు నాకొక సహాయము చేయవలెను. నీతో నాకు పనివచ్చినది. నీవు తప్పక ఆ పనిని చేయవలెను. ఆ అవసరము నీవేతీర్చవలెను. నేనిచ్చు కానుకలు వుత్తరము తీసుకొని సెరిండిబ్ రాజునకు అందించి రావలెను. ఆతనికి జబాబు పంపుట మర్యాదగదా?" అని చక్రవర్తి నాతో అనెను.

చక్రవర్తి ఆజ్ఞ నాకు పిడుగుపడినట్లయ్యెను. నేను చేతులు జోడించి "మహాప్రభూ! మీ ఆజ్ఞను మన్నించెదను. కాని దీనుడనగు నా విన్నపము ఆలించుడు. నేనిదివరలో అనేక ఆపదలుపొంది కష్టపడి ప్రాణములు దక్కి వచ్చితిని. ఇంక యిప్పుడు బాగ్దాదునగరము విడిచి వెళ్ళనని ఒట్టుపెట్టుకొంటిని" అని నా సాహసచరిత్ర చెప్పితిని. చక్రవర్తి నా సాహసములకు చాల వింతపడెను. "నీకథ చాల విచిత్రముగా నున్నది. నీవు పొందిన ఆపదలు సాధారణమైనవికావు. నేను చాల విచారించితిని. కాని నీవిప్పుడు నాకొరకై ప్రయాణము తప్పక చేయవలెను. నీవు సిరండిబ్ దీవి రాజుదగ్గరకు పోయి కానుకలు

వుత్తరము యిచ్చి వెంటనే మరలిరమ్ము. ఇంతియే నీవు చేయవలసినది. ఇంతకు యెక్కువలేదు. నీవు తప్పక వెళ్ళవలెను. నీ విదివరలో యెరుగున్న ప్రయాణమార్గమే కదా! నేనే స్వయముగా వెళ్లుట గౌరవమునకు తగనిపని" అని చెప్పి చక్రవర్తి నన్ను బలవంతపెట్టెను. చక్రవర్తి బలవంతపెట్టుటచే మారుచెప్పలేక ప్రయాణమునకు సమ్మతించితిని. చక్రవర్తి మిక్కిలి సంతోషించి నా ఖర్చులకై రెండువేల బంగారు నాణెములు యిప్పించెను.

కొన్ని దినములు పోయిన తరువాత చక్రవర్తి కానుకలు వుత్తరము నాకిచ్చిన వెంటనే ప్రయాణసన్నాహములు చేసితిని. నేను బాల్సారానుండి ఓడపై ఆనందముగా ప్రయాణము చేసి కొంత కాలములో సిరిండిబ్ ద్వీపము చేరితిని. అచ్చటి మంత్రులు, యితర వుద్యోగస్తులు నన్ను బాగుగా యిదివరలో యెరుగుండుటచే అమిత సంతోషముతో నాకు స్వాగతమిచ్చిరి. నేను చక్రవర్తి పనిమీద వచ్చితినని వారితో చెప్పితిని. వారు నన్ను రాజభవనమునకు గౌరవముగా తీసుకొనివెళ్ళిరి. నేను రాజునకు మిక్కిలి వినమ్రతతో వంగి వంగి నమస్కారములు చేసితిని. రాజు వెంటనే నన్నుపోల్చి గుర్తుపట్టి మిక్కిలి ఆనందించెను. "సిందుబాదు! నీవు వెళ్ళినతరురాత నిన్ను చాలసార్లు తలచుకొంటిని. నిన్ను మరల యెప్పుడైన చూచెదనా? అని అనుకొంటిని. ఈ రోజు గొప్పది. నిన్ను నేను మరల చూడగల్గితిని. నా భాగ్యవశముచే నీవు మరల నాదగ్గరకు

వచ్చి సంతోషపరచితివి" అని రాజు అనెను. రాజు చూపిన ఆదరాభిమానములకు చాల సంతోషించి నమస్కరించితిని. చక్రవర్తి యిచ్చిన కానుకలు వుత్తరము యిచ్చితిని. ఆ రాజు మహానందముతో వాటిని గ్రహించెను. అతడు నేనూహించ లేనంత సంతోషము పొందెను.

చక్రవర్తిపంపిన కానుకలలో మొదటిది:- లక్ష రూపాయలు ఖరీదుచేయు బంగారుతో తయారుచేయబడిన బట్టల జతలు. విలువ కట్టలేని ముఖమలు పట్టుదుస్తులు.

రెండవది:- కెయిరో, అలెగ్జాండ్రియాలో తయారైన అతి సున్నితమైన తెల్లని పట్టుసెల్లాలు, ఎర్రని కెంపురంగు అంచులుగల ముఖమలు పట్టుదుస్తులు, సుమారు ఇరవై వేల రూపాయలు విలువైనవి.

మూడవది:- అంగుళము దళసరి, అడుగులోతు రెండు అడుగులు వెడల్పు, పొడుగుగల వెలగల పాలశిల రాతిగిన్నె; దానిలో ఒక కాలువంచి విల్లుబాణముతో సింహమును కొట్టుచున్న మనిషిబొమ్మ కలదు.

నాల్గవది:- మంచి విలువగల రత్నములతో చిత్రములు చెక్కిన పవిత్రమైన తెల్లబల్ల. ఈ నాల్గువస్తువులు చరిత్ర ప్రసిద్ధమైనవి.

చక్రవర్తి వుత్తరములోని భావము:- అభివందనములు. న్యాయపరిపాలన సాగించుచు పూర్వచక్రవర్తులనుండి దేవునిచే గౌరవస్థానమును పొందిన వంశములోనివాడవగు హారూన్

ఆల్‌రసీదు చక్రవర్తినుంచి మీలేఖను సంతోషముతో అందు కొంటిమి. మీకు యీ కానుకలు, ఫుత్తరము స్నేహితునితో పంపితిని. మీరు వాటిని తీసుకొని మా స్నేహమును సదభి ప్రాయమును గ్రహించగలరని తలచెదను.

ఇట్లు

మీ స్నేహితుడు నమస్కారములు.

ఈ వుత్తరమును కానుకలుచూచి రాజు ఆనందించెను. పిమ్మట నేను రాజభవనములో రాజునకు అతిథిగా వుండి పోతిని. తుదకు ఒక రోజున రాజుశలవుకోరి నా దేశమునకు పోవుదునని చెప్పితిని. రాజు నన్ను విడువలేక అతికష్టముపై వెళ్లుటకు అంగీకరించెను. నాకు అమితముగా ధనము బహుమతీ చేసెను. నేను వెంటనే బయలుదేరి ఓడప్రయాణము చేయుచు బాగ్దాదునగరమునకు వచ్చుచుంటిని. కొంత దూరమువరకు చాల సుఖముగా మా ప్రయాణము సాగినది. ఇంతలో దైవవిధి మారిపోయినది. మాకు కష్టదినములు వచ్చినవి. నాలుగైదు రోజులు గడిచినతరువాత మా ఓడను చుట్టుముట్టి ఓడదొంగలు పట్టుకొనిరి. మా సరుకు దొంగిలించుకొని పోసాగిరి. మాలో చాలమంది ధైర్యవంతులు ఆ దొంగలతో పోట్లాడి ప్రాణములు పోగొట్టుకొనిరి. కాని ఆ దొంగలు మాత్రము మమ్ము వదలలేదు. నన్ను మరికొంతమంది ప్రయాణీకులను ఆ దొంగలు పట్టుకొని బానిసలుగా చేసిరి. మా మంచిబట్టలు విప్పివేసి పనికిరాని చిన్న గుడ్డపీలికలను కట్టబెట్టిరి. మమ్మందరిని చాల దూరముగా

నున్న ఒక దీవికి తీసికొనిపోయి అక్కడ అమ్మివేసిరి. నేనొక ధనికుడగు వర్తకుని చేతిలో పడితిని. ఆ భాగ్యవంతుడు నన్ను కొనినవెంటనే యింటికి తీసుకొనిపోయి దయచూపించి బానిసకు తగిన మంచి బట్టలు యిచ్చెను. కొన్ని రోజులవరకు నన్నేమి అడగకుండా తిండిమాత్రము పెట్టుచుండెను.

ఒకరోజున ఆ వర్తకుడు నేనెవరినో అడిగి తెలిసికొన కుండగానే "నీకేదైన వ్యాపారము చేయుట తెలియునా ?" అని అడిగెను. "నేను ఒక వర్తకుడను. సముద్రదొంగలు మా ఓడలోని సరుకులు యెత్తుకొనిపోయి నన్ను బానిసగా అమ్మివేసిరి" అని ఆతనితో అంటిని "సరే దానికేమి. నీవు బాణముతో వేటాడగలవా ? చెప్పుము" అని ఆతడు అడిగెను. "నేను చిన్నతనములో విల్లు అమ్ములతో బాణములవేట కొంచెము నేర్చుకొంటిని. నేను బాగా వేటాడగలను" అని అంటిని.

ఆ వర్తకుడు నాకొకవిల్లు బాణములు యిచ్చి ఆతని యేనుగుపై కూర్చుండబెట్టుకొని ఒక మహారణ్యములోనికి తీసుకొనిపోయెను. ఆ అరణ్యములో చాలదూరము పోయితిమి. ఆతడు నన్ను ఒకచోట ఆపి దింపివేసెను. అక్కడే ఒక పెద్ద చెట్టుకలదు. ఆ చెట్టును చూపించి "నీవు యీ చెట్టెక్కుము. ఇక్కడనుంచి చాల యేనుగుల గుంపులు పోవుచుండును. నీవు వాటిలో ఒక యేనుగను వేటాడి పట్టుకొనుము. ఏదైన

యేనుగు నీబాణముచేత పడిపోయిన వెంటనే నాకువచ్చి కబురుచెప్పుము " అని చెప్పి భోజనసామగ్రియిచ్చి నన్నువిడిచి ఆతడింటికి పోయెను.

నేను చెట్టెక్కి రాత్రంతయు అక్కడే గడిపితిని. ఆ రాత్రివేళ ఒక్కయేనుగ కనబడలేదు. కాని మరునాడు సూర్యోదయమైన తరువాత ఒక పెద్దయేనుగుల గుంపును చూచితిని, నేను చాల బాణములతో యేనుగులను కొట్టితిని. తుదకొక యేనుగ నా బాణముదెబ్బతగిలి క్రిందపడిపోయెడు. ఏనుగలుఅన్ని పోయినతరువాత నేను చెట్టుదిగివచ్చి నా యజమానుడగు వర్తకునితో యీ సంగతి చెప్పితిని. ఆ ధనికుడు సంతోషించి నాకు మంచి విందుభోజనము పెట్టెను. నావేట నేర్పు మెచ్చుకొని చాల పొగడెను. సంతోషముతో కౌగలించుకొనెను. తరువాత మేమిద్దరము కలిసి అరణ్యములోనికి ఏనుగ పడివున్న చోటునకు వెళ్ళితిమి. ఒక పెద్ద గొయ్యితీసి ఆ ఏనుగను అందులో పాతిపెట్టితిమి. కొంతకాలమైన తరువాత మా యజమాని యేనుగ దంతములు, యెముకలు పోగుచేసి తెచ్చి వర్తకము చేయసాగెను. నేను రెండు నెలలవరకు రోజుకొక ఏనుగ వంతున వేటాడితిని. ఒక రోజున ఒకచెట్టుపై నుండి యింకొకరోజున మరొకచెట్టుపైనుండి బాణములతోకొట్టి అవలీలగా ఏనుగలను వేటాడగల్గితిని.

ఒకనాడు నేను యేనుగులకై ఒకచెట్టుపై కూర్చుంటిని. రోజువలెనే మామోలుగా ఆ యేనుగుల గుంపు అడవిలోనుంచి తిన్నగా నేనున్న చెట్టుదగ్గరనుంచి పోలేదు. నేను యెక్కిన

చెట్టుక్రింద పెద్ద 'ఘీం' కారములు చేయుచు ఆగిపోయినవి. ఆ ఏనుగులమంద యెంతవున్నదో చెప్పలేను. వందలకొద్ది వేలకొద్ది ఏనుగులు నేల యీనినట్లు భూమి అంతా ఏనుగులతో నిండిపోయెను. నేనెక్కిన పెద్దచెట్టుచుట్టూ నిలబడి తొండములు పైకెత్తి తిన్నగా నాకేసి కళ్లెట్టి చూచినవి. నాకు చాల కంగారు భయము పుట్టినది. చేతులు కాళ్లు వణికిపోయినవి. నేను కదలలేకపోయితిని. నాచేతిపట్లు తప్పి విల్లు బాణములు క్రిందపడిపోయినవి. నాకు భయము పోలేదు, చెట్టుమీదనక్కి కూర్చుంటిని. ఆ ఏనుగులలోకెల్ల పెద్దఏనుగు తొండమును చెట్టునకు చుట్టబెట్టి కదిపి కదిపి వూపివేసి బలముగా పైకిలాగి క్రిందకు విసిరికొట్టెను. నేను చెట్టుతో కూడ నేలపై పడిపోతిని.

పెద్దఏనుగు నన్ను తొండముతో లేవదీసి వీపుపై కూర్చుండబెట్టుకొనెను. నేను భయముచే నొక్కుకొని అణిగి పోయి ప్రాణములు లేనివానివలె కూర్చుంటిని. అమ్ములపొది మాత్రము నా భుజముపై నే వ్రేలాడుచుండెను. నన్ను మోయుచున్న పెద్దయేనుగ ముందు నడుచుచుండెను. నన్ను దానితో కూడ ఏనుగ సమూహాము నడచివచ్చెను. ఆ ఏనుగలు నన్ను తిన్నగా తీసుకొనిపోయి ఒక యెత్తైనచోట దింపివేసి వెళ్ళిపోయినవి. అప్పటి నా అవస్త మీరే వూహించుడు ? ఎంతకష్టమో నేనేమియు చెప్పలేను. నేనెక్కడ నుంటినో నాకేమియు తెలియదు. అదికలేమో అని తలచితిని. నేను కొంచెము కంగారు తగ్గినతరువాత అలసట తీర్చుకొని లేచి

చూడగా ఒక పెద్ద యెత్తుగానున్న కొండమీద వున్నట్లు తెలుసుకొంటిని. నేను చాల భయపడితిని. పర్వతముమీద చాల విశాలముగా నుండెను. ఆ చోట యెక్కడచూచినా ఏనుగదంతములే! యెముకలే! ఆ స్థలముచూచిన నాకు చాల ఆశ్చర్యము కలిగినది! నాకు అనేక ఆలోచనలు కలిగినవి. అక్కడే ఏనుగలను పాతిపెట్టుచోటు. ఏనుగదంతములు, యెముకలు గుట్టలుగానున్నచోటు నాకు చూపించుటకే ఆ ఏనుగులు నన్నచ్చటకు తీసుకొనిపోయి పడేసినవి. నేను ఏనుగలు చేసినపనికి చాల సంతోషించితిని. నేను యిక దంతములకై ఏనుగులను చంపకుండా విడిచిపెట్టుటకై యిక్కడకు నన్ను తీసుకొనివచ్చి విడిచిపెట్టినవి" నేనెంతో కాలము ఆ కొండపై ఆగలేదు.

నేను నెమ్మదిగా ఆ కొండదిగి అచ్చటినుండి బయలుదేరి రెండు మూడు రోజులు ప్రయాణముచేసి నా యజమాని దగ్గరకు వచ్చితిని. నేనువచ్చు మార్గములో ఒక్క ఏనుగైనా మళ్ళీ కనబడలేదు. ఆ ఏనుగులగుంపు కొండకు పోవుదారి విడిచి అరణ్యములోనికి చాలదూరముగా పోయినవి. నన్ను చూడగానే నా యజమాని అపరిమితముగా సంతోషించెను. "అయ్యో! సిందుబాదు! నీకు యేమిఆపద సంభవించినదో అని మిక్కిలి విచారించితిని. నీవు రాకపోవుటచే నేను అరణ్యము లోనికి వెళ్ళిచూచితిని. క్రొత్తగా ఒక పెద్దచెట్టు వ్రేళ్ళతో కూడ పెల్లగింపబడి క్రిందబడివుంది. అక్కడే విల్లు బాణములు

నేలమీదపడిపోయి వున్నవి. నీవు కనబడలేదు. నీకొరకై కేకలుపెట్టితిని. ఎవ్వరును పలుకలేదు. నీవు చచ్చిపోతివని యిక నిన్ను చూడనేమో అని తలచితిని. అన్నా! నీకు యేమి ఆపద సంభవించినది? ఎట్టి పుణ్యముచేత మరల బ్రతికి వచ్చితివి? చెప్పుము" అని ఆతడు అడిగెను. నేను జరిగిన దంతయు చెప్పి ఆతనికి తృప్తికలిగించితిని.

మరునాడు యిద్దరమును బయలుదేరి ఏనుగుపై ఆ కొండకు పోతిమి. అచ్చట రాసులుగా పడివున్న ఏనుగు దంతములు యెముకలు చూచి నా యజమాని సంతోషము పట్టలేకపోయెను. నేను చెప్పినదంతయు నిజమేనని మిక్కిలి ఆనందించెను. మేమువచ్చిన ఏనుగుపై అది మోయగలిగినన్ని దంతములు, యెముకలుపేర్చి తిరిగి యింటికి వచ్చుచుంటిమి. అప్పుడు ఆతడు "అన్నా! అని చేయిపట్టుకొని నీవు నాకు బానిసవుకావు. అమితమైన ఐశ్వర్యమునివ్వగల ధనాగారమును చూపిన స్నేహితుడవు. మహా ఆప్తుడవు. స్నేహితుడవు. దేవుడు నీకు సర్వసౌఖ్యములిచ్చి రక్షించుగాక! అని ప్రార్థించెను. "దేవునియెదుట ప్రమాణముచేసి చెప్పుచున్నాను. నీకు బానిసతనములేదు. స్వేఛ్ఛగా నుండవచ్చును. నేను నీకు యజమానిని కాను. నీవు నీదేశమునకు పోవచ్చును.

ఈ యేనుగుల వేటలో ఒక రహస్యము యిమిడి యున్నది. ఈ అడవిలోనున్న యేనుగులు ప్రతీయేటా నీవంటి బానిసలను మేము వేటాడుటకు పంపినప్పుడు చంపివేసేవి.

వారు మావల్ల తగిన జాగ్రత్తతో సూచనలను తీసుకొన్నను యెప్పుడో ఒకప్పుడు యేనుగులవల్ల చచ్చిపోయేవారు. దేవుడు నీపై కరుణించుటచేత ఆ ఏనుగుల కోపమునకు గురికాక నీవొక్కడవు మాత్రమే బ్రతికివచ్చితివి. అందుచే దేవుడు నీపైపరిపూర్ణ ప్రేమతో ఉన్నాడని తెలియుచున్నది. దేవుని దయచే నీవునాకు లెక్కలేనంత యెప్పటికి తరగని ధనమును సమకూర్చిపెట్టితివి. నా బానిసలు చాలమంది చచ్చిపోయిరే కాని యెవ్వరును యిట్టి ఏనుగదంతములు తీలేకపోయిరి. నీవు నాకు యీ పట్టణమునకు కూడ సరిపడునంత మహావిలువైన ఏనుగదంతములు యిచ్చితివి. యిదంతయు నీమూలముననే నాకు ప్రాప్తించినది. నీకు యేమిచ్చినను ఋణముతీరదు. నీకు బానిసతనము పోగొట్టుటేకాదు. ఇంకను నీకమితముగా ధనమును బహుమతీ యిచ్చెదను. తీసుకొనవలెను. ఈ పట్టణవాసులచేత కూడ అపరిమితధనమును కానుకలుగా యిప్పించెదను " అని చెప్పెను.

నేను "అన్నా ! నాకు కానుకలువద్దు. నాదేశమునకు పోవుటకు స్వేఛ్ఛయిచ్చితివి. అంతేచాలును. అదియే పదివేలు. ఇకనాకు వేరే బహుమతులక్కరలేదు " అని సంతోషముతో చెప్పితిని. " ఇప్పుడు గాలి సరిగాలేదు. సముద్రప్రయాణము కష్టము. కావున నీవు యిక్కడ కొద్దికాలము ఆగుము " అని ఆతడు కోరెను. నేను మంచిగాలి వీచువరకు అచటనే రెండు

మూడు నెలలవరకు ఆగిపోతిని. మేము ఆ పర్వతమునకు ఏనుగపై చాలసార్లుపోయి విలువలేనంత ఏనుగదంతములను తీసుకొని వచ్చితిమి.

ఒక మంచిరోజున ఒక ఓడనుచూచి దానిని ప్రయాణమునకు యేర్పరిచితిని. నేను తెచ్చిన ఏనుగదంతములను బేళ్లుగా కట్టించి ఓడలో యెక్కించితిని. ఆ వర్తకుడు నాకు అమితమైన ధనమును కానుకగా యిచ్చెను. నేనాతనికి మిక్కిలి వినయముతో నమస్కరించి ఓడ యెక్కి ప్రయాణము సాగించితిని. నేను బానిసగా అమ్మబడిపోయినను దైవానుగ్రహముచే స్వాతంత్రమును సంపాదించి, తిరిగి క్షేమముగా యింటికి పోవుచున్నందుకు చాల ఆనందించితిని. యిది అన్నిటికంటె ఆశ్చర్యకరమైన విషయముకాదా ? కొన్ని ద్వీపములలో దంతములు అమ్మి సొమ్ముచేసి విశేషధనము గడించితిని. కొంత క్రొత్తసరుకులు కొంటిని. అచటినుండి బాల్సారా చేరువరకు సముద్రప్రయాణము చేయుటమాని భూప్రయాణము సాగించితిని. నేను చాల వర్తకులతో కూడి ప్రయాణీకులతో కలిసి వెళ్ళితిని. మార్గములో చాల కష్టము కలిగెను. వాటిని ఓర్పుతో సహించితిని. కాని యిదివరలో పాములవల్ల దొంగలవల్ల ఓడ పగులుటవల్ల కలిగిన ప్రమాదములు మాత్రము నాకు కలుగలేదు. అందుకు సంతోషించితిని. తుదకు సురక్షితముగా బాగ్దాదు పట్టణము చేరితిని. ఇదియే నా సాహసచరిత్రలో తుదిప్రయాణము.

నేను వెంటనే చక్రవర్తిదగ్గరకు పోయి జరిగినదంతయు విన్నవించితిని. నా సాహసచరిత్రను విని చక్రవర్తి మిగుల ఆశ్చర్యపడి తిరిగి సుఖముగా వచ్చినందుకు సంతసించెను. "నీవు చాలకాలమువరకు రాకపోవుటచే కొంచెము దిగులు చెందితిని. దేవుడు నిన్ను తప్పక కరుణించి ఆపదలు తప్పించి యిల్లు చేర్చునని తలచుచునే యుంటిని" అని చక్రవర్తి చెప్పెను. నా చరిత్రను సువర్ణాక్షరములతో వ్రాయించి దర్బారులో భద్రపరచెను. నన్ను మిక్కిలి గౌరవించి అమితముగా ధనము బహుమతీచేసెను. నేను శలవుతీసుకొని యింటికి వచ్చితిని.

నా బంధుమిత్రులు మిక్కిలి ఆనందించిరి. నేను తెచ్చిన ధనమంతయు వారికి చూపించితిని. వారు సంతోషించిరి. ఈ ధనమంతయు ఆ పరమేశ్వరుని కరుణచే సంపాదించితిని. అన్నా! నేపడిన కష్టములు, సహించిన బాధలు, పొందిన ఆపదలు యిదివరలో యెవ్వరైన పొందిరా? నేనెంత ఆందోళన పడితినో, యెంత మనోబాధను పొందితినో చెప్పలేను. ఏ మనుష్య మాత్రుడును యిన్నికష్టములు సహించలేడు. నా కష్టముల ముందర నీవు పడుచున్న కష్టములు ఒక లెక్కలోనివా? నాకువచ్చిన లాభములవలన ఆ కష్టములను మరచి పోయితిని. నాకున్న ఐశ్వర్యముతో యిట్లు సుఖములు అనుభవించుచున్నాను. నా ధనమును బీదసాదలకు పంచియిచ్చితిని. బంధుమిత్రులకు తృప్తిగా విందు చేయుచు ఆనందముగా జీవించుచుంటిని.

హిందుబాదు! నీవుకూడ నేను యిచ్చిన ధనముతో సుఖముగా నుండుము. నీవు కూలిపని మానివేయుము. ప్రతి దినము నా యింటికి విందునకు రమ్ము" అని చెప్పి నూరు రూపాయలు బంగారు నాణెములు బహుమతియిచ్చెను. సిందుబాదు తన సాహసచరిత్రను ఐశ్వర్యవంతుడైన విధమును చెప్పి ముగించెను.

యిట్టి సాహసవంతుల చరిత్రలు చిరకాలమువరకు జ్ఞాపకమునకు వచ్చుచుండునుగదా! పరమేశ్వరుని కరుణ గలవారికి యీలోకములో పొందజాలనివి లేవు! ఆ దయామయుడే సర్వరక్షకుడు.

సమాప్తము.



శ్రీ రాజేశ్వరి ప్రెస్, రాజమహేంద్రవరము.